# శ్రీ రామకథా మకరందము

## బాలకాండము







మధురకవి

డా. ఉపాధ్యాయుల గౌరీశంకర రావు

# పరిచయం...



పేరు : డా. ఉపాధ్యాయుల గౌరీ శంకర రావు

జననం : 21/2/1960

తల్లిదండ్రులు : కీ.శే.సూర్యకాంతమ్మ, కీ.శే.నారాయణమూర్తి
మురగడాం గ్రామం, మన్యంజిల్లా.

విద్య : భాషా ప్రవీణ, M.A,.P.hd

ఉద్యోగం : (రి)ప్రధానోపాధ్యాయుడు

బిరుదు : మధురకవి

రచనలు : 1. సిరిసిరిమువ్వలు. 2. ప్రస్తుతి
3. రాసకేళి 4. శివసంకల్పమస్తు 5. కర్మయోగి
6. సౌందర్యలహరి 7. శివానందలహరి
8. శ్రీరామకథామకరందము-బాలకాండము
9. సుందరకాండము 10. దళారి(కథలు)

అముద్రితాలు : 1. కవిపలుకులు(త్రిశతి) 2. సోహం(ఖండకావ్యం)
3. శ్రీకృష్ణోదాహరణం. 4. వచనకవితలు
5. భారతంలో కృష్ణుడు (సిద్ధాంత గ్రంథం)

నివాసం : ఈ2, వాసుదేవవైభవ్
1వలైను, పద్మావతి నగర్
వేపగుంట పోష్టు
విశాఖ పట్నం - 530 047

ఫోన్ : 9550231590

# శ్రీ రామకథా మకరందము

## బాలకాండము




మధురకవి

**డా. ఉపాధ్యాయుల గౌరీశంకర రావు**

# శ్రీరామ కథామకరందము

బాలకాండము

రచన:
'మధురకవి' డా. ఉపాధ్యాయుల గౌరీశంకరరావు



ప్రతులు: 500
ముద్రణ: డిసెంబరు 2022

**వెల: రూ. 200/-**

ప్రతులకు:
**U.Gouri Sankara Rao**
E-2, vasudeva vaibhav
1st lane.padmavathi Nagar
Vepagunta post
Visakhapatnam 530047
Phone 9550231590

ముఖచిత్రం,కూర్పు: పంతులవిట్టుబాబు, చరవాణి: 8555082034
ముద్రణ: జయభాస్కర ప్రింటర్స్ & పబ్లిషర్స్, హైదరాబాద్.

# శ్రీరామమథామృతము - బాలకాండము

## విషయసూచిక

# కృతజ్ఞతలు

జన్మనిచ్చిన తల్లి తండ్రులకు-

అక్షరభిక్ష పెట్టిన ఎందరో మహానుభావులు వారందరికి-

రామాయణాన్ని రచించి నామధురకవితను చిరస్థాయిగా నిలుపుకోవాలని ఆశీస్సులు అందించిన గురుపాదులు శ్రీవేదుల వారికి-

బాలకాండ ను వివిధ వాట్సాప్ గ్రూపుల్లో ప్రచురించిన అడ్మిన్లకు దానిని చదివి నన్ను ప్రోత్సహిస్తూ కామెంట్లు పెట్టిన వార్కి, ఫోన్లు చేసి అభినందనలు తెలిపినవారికి సలహాలు సూచనలు అందించినవారికి-

వాట్సాప్ గ్రూపులో నాపద్యాలుచదివి బాలకాండను ప్రచురించడానికి తక్షణం ఏర్పాట్లు గావించిన శ్రీ తూములూరి మురళీధర్ శర్మ, హైదరాబాద్ వార్కినేనెంతో ఋణపడి ఉంటాను. వారికి వారి కుటుంబానికి ఆరామచంద్రుడు అండదండయై ఉంటాడని..వారికి-

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించి గుణదోషవిచారణచేసి పరిష్కరించడమే కాకుండా సమగ్రమైన అభిప్రాయం అందించి వాత్సల్యాన్ని ప్రదర్శించిన గురుపాదులు ఆచార్య సార్వభౌములు వేదులవారికి-

ఆశీస్సులు అందించమని ఫోనులో కోరిన వెంటనే అంగీకరించి గ్రంథాన్ని కూలంకషంగా పరిశీలించి తగు సూచనలు సలహాలు అందించి ఆశీర్వదించిన ప్రాచార్యులు శలాకరఘునాథశర్మ, రాజమహేంద్రవరం గారికి-

పుస్తకానికి అందమైన ఆకృతి కల్పించిన శ్రీ పంతుల విట్టుబాబుగారికి- సకాలములో చక్కగా ప్రచురించి ఇచ్చిన జయభాస్కర ప్రింటర్స్ & పబ్లిషర్స్, హైదరాబాద్ వారికి వారి సిబ్బందికి హృదయపూర్వక ధన్యవాదాలు.

ఇట్లు

ఉపాధ్యాయుల గౌరీ శంకర రావు

మహామహోపాధ్యాయ
రాష్ట్రపతిపురస్కార సమ్మానిత
ప్రాచార్య శలాక రఘునాథశర్మ
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ విశ్రాంత ఆచార్యులు
Mahāmahopādhyāya,
Recipient, Rāshtrapathi Puraskāra
**Prāchārya Śalāka Raghunātha Śarma**
Retd. Prof. Telugu SKU, Anantapur, AP.




# అభినందన

'శ్రీరామకథామకరందము' అనే మధురమైన కావ్యాన్ని అనుశీలించే అవకాశం లభించింది. మధురకవి బిరుదాంకితులు శ్రీ ఉపాధ్యాయుల గౌరీశంకర్ ఈ కావ్య నిర్మాత. "రాఘవేశ్వరు చారిత్రము నెందఱెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని పూర్వ కవులు చెప్పియే యున్నారు. ఈ మకరందం ఆ త్రోవలో ఒక హృద్యమైన కావ్యం.

ఇందులో బాలకాండ కథా విశేషాలు నాలుగు ఆశ్వాసాలుగా విభక్తమై మనకు అందుతున్నాయి. రచనలో చదివించే గుణం నిండుగా ఉన్నది. చక్కని చిక్కని భావుకతా విలసితమైన పద్యాలు ఈ కావ్యంలో సమృద్ధిగా ఉన్నాయి. మచ్చునకు ఒకటి రెండు.

సీ. స్వరమోహనమ్మైన వరవేదగీతినా
గంగమ్మ నడయాడకలుగు హోరు
నట్టువాంగముచూపి నర్తించు భామనా
గంగమ్మనడకలో క్రాలు హొయలు
అష్టావధానాన నలరించు కవితనా
గంగమ్మగలగలల్ పొంగు గూర్చు
రసభావపుష్టమౌ రమణీయవాక్కునా
గంగాజలమ్ములు గరిమజూపు

తే.గీ. చెంగు చెంగున దూకెడి చిన్ని లేడి
విధము గంగమ్మపరవళ్ళు పెట్టుచుండె
శివుని జూటమ్ము వెడలిన చిన్ని యేరు
భూమి ప్రవహించె లోకాలు పులకరింప తృ.66

ఇందులో ఉపమానాలు అపురూపంగా ఉండటం విశేషం.

చం. మొలక చిగిర్చె నాచివురు మోవిని కోరక మొక్కడుండె నా
కళికలు విచ్చె నా విరులుగంధము పంచెను సౌరభమ్ముచే
నళులు భ్రమించె నా భ్రమణమందున తేనెలు జాలువారె నా
తలిరులతోటలోన సుఖదంపు వసంతము వచ్చువేళలన్... 4.32

నాచన సోమనాథుని పద్యం వంటిదై ఇది పరమ హృద్యంగా అలరారుతున్నది.

మొత్తం మీద కావ్యం ప్రాచీన మహాకవుల పోకడలను పుణికిపుచ్చుకుని రసానుభూతి కలిగించే తీరులో సాగింది.

ఈ కవి గారిని నేను మనసారా అభినందిస్తున్నాను.

ఆచార్య సార్వభౌమ
ప్రొ॥ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి
M.A., Ph.D.(Telugu) M.A. Ph.D. (Sanskrit)
Retired Professor & Former Head of the Dept. or Telugu
Andhra University, Visakhapatnam

"శారదాపీఠం"
46-15-55, దొండపర్తి
విశాఖపట్నం – 530 016
ఫోన్: 0891 – 2541001
సెల్: 9490084217

# మకరంద మాధుర్యం

వేదవేద్యుడైన పరమపురుషుడు రావణాది రాక్షస సంహారార్థం రఘు రామునిగా అవతరింపగా వేదమే శ్రీమద్రామాయణంగా సంతరింపబడింది. తత్కర్త వాల్మీకి. రామకథను ఏడుకాండలు గా విభజించి, ఇరవైనాలుగు వేల శ్లోకాలలో సంస్కృత భాషలో మహాకావ్యంగా రచించాడు. సంస్కృతంలో ఆతడు ఆదికవి. ఆ రామాయణం ఆదికావ్యం. అది సర్వమానవాళిని సముద్ధరించడం కోసం రచింపబడినది కాబట్టి నేటికీ వివిధ భాషలలో వివిధ ప్రక్రియలలో అనువదింప బడుతూనే ఉన్నది.

చి|| డా. ఉపాధ్యాయుల గౌరీశంకరరావు గుంటూరు జిల్లాలోని జిల్లెల్ల-మూడిలో ప్రసిద్ధికెక్కిన మాతృశ్రీ సంస్కృత కళాశాలలో సంస్కృతాంధ్రాలు అధ్యయనం చేసి, భాషాప్రవీణ పట్టభద్రుడై, అనంతరం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో ఎం.ఏ. చదివి ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. అప్పుడు మాకు విద్యార్థి. తెలుగులో డాక్టరేట్ కూడా పొందినాడు. తనకు గల ప్రతిభతో ఖండకావ్యాలు, శతకాలు రచించి కవిగా కూడా ప్రసిద్ధి పొందినాడు. తెన్నేటి విశ్వనాథం పంతులు గారి జీవిత చరిత్రలు పద్యకావ్యం గా రచించినాడు. పెక్కు లఘు కృతులు రచించుట కంటె ఇహపర తారకమైన రామాయణాన్ని పద్య కావ్యంగా రక్షింపుమని ఉపదేశంపగా గురుభక్తితో స్వీకరించి అనువాదానికి పూను కొనడం పరమ హర్షదాయకం.

రాముని బాల్య విశేషాలు వర్ణింపబడిన కాండ కాబట్టి బాలకాండగా నామ-కరణం చేయబడింది. ఆకాండలోనే పరమాత్మ అవతారతత్వం ఆరంభం అవుతోంది. పదహారు సంవత్సరాల వయస్సు నిండక పూర్వమే తాటకను వధించాడు. సుబాహువుని సంహరించాడు. మారీచుని శిక్షించాడు. విశ్వామిత్రుని యాగాన్ని సంరక్షించాడు. అఖండ పరాక్రమశాలిగా ప్రసిద్ధి పొందిన పరశురాముని గర్వాన్ని

అణచివేశాడు. రాముని అవతార ప్రశస్తికి ఈ కాండలోనే శుభారంభం గావింపబడడం చేత పౌరాణిక సంప్రదాయంలో బాలకాండము అవతార కాండ అని కూడా వ్యపదేశం స్థిరపడింది.

తన రామాయణానువాదానికి “శ్రీరామకథామకరందము” అని నామకరణం చేసి రామకథ రామనామము, రామస్మరణా అనే వాటి వైశిష్ఠ్యాన్ని పీఠికలో కవి “మకరందంబిది రామగాథ, తారక మంత్రమ్మగు రామనామ మిలలో రక్షించు జన్మంబు, మేచక వర్ణుండగు చాపధారి తలపుల్ సాయుజ్యమిప్పించు” అని పేర్కొనినాడు. అనంతరం రామకథల ప్రాభవాన్ని

*జీవుని వేదన బాపెడి*
*జీవరసాయన గుళికలు శ్రీరామకథల్*

అది ఉగ్గడించి రామాయణ వైభవాన్ని సూత్రప్రాయముగా పాఠకలోకానికి ఉపదేశించి నాడు. అంతేగాదు. రాముడు పరబ్రహ్మమనే పరమసత్యాన్ని

*ఏ యానందము నిత్యమై నిఖిలమై సృష్ట్యంత పర్యంతమై*
*మాయాచ్ఛేదన మూలమై సుగతికిన్ మార్గమ్మునై యొప్పునో*
*ఆ యానందపు రూపమున్ నుడివెదన్ హర్షాతిరేకమ్ముతో*

అని ఆవిష్కరించినాడు. వాల్మీకి వ్యంగ్యంగా, ఆధ్యాత్మ రామాయణ కర్త వాచ్యంగా నిరూపించిన రా మతతత్వాన్ని విశదీకరించి నాడు.

శ్రీరామ తత్వాన్ని హృదయదఘ్నంగా ఆస్వాదించినవారు గౌరీశంకరులు. గౌరీ శంకర నామధేయుడు అయిన ఈ రచయిత కూడా తాదృశమైన అనుభూతి పొందినవాడే అని ప్రథమాశ్వాసారంభంలో ఆతడు “నదియై సాగెడు రామగాథ మకరందమ్మోచు పొంగారె నా హృదయస్థానము నుండి” అని రచయిత వాక్యం వల్ల స్పష్టమౌతోంది. రామాయణ రచన కి సమర్థుడని కూడా తేటతెల్లమౌతోంది.

సముచిత పదప్రయోగ దక్షత, అనల్ప కల్పనా సమర్థత అనే రెండు గుణాలు కవికి అవశ్యం పొందదగ్గవి. అవి లేని నాడు అతని రచన నిర్జీవ ప్రతిమా సదృశ మవుతుంది. డా. ఉపాధ్యాయుల గౌరీశంకర రావులో ఆ రెండు లక్షణాలు పుష్కలంగా ఉన్నట్లు ప్రతి సన్నివేశమూ విశదం చేస్తుంది. వాల్మీకి మున్యాశ్రమాన్ని వర్ణిస్తూ

“ఛందస్సుందరమైన వాక్కు+ (1-4) అని చెప్పిన వాక్యం ఈ బాలకాండ రచనకు కూడా సమంగానే వర్తిస్తుంది.

వాల్మీకి రామాయణంలోని ప్రధాన కథను స్వీకరించి సందర్భ సముచితమైన వర్ణనలతో కావ్యోచితంగా రచించడంలో రచయిత కృతకృత్యుడైనాడు. పెక్కు సందర్భాలలో పదప్రయోగం లోనూ కల్పనలలోనూ కవి యొక్క అనుపమ ప్రజ్ఞ ప్రస్ఫుటమవుతూ ఉంటుంది.

వాల్మీకి ముని ఆశ్రమం వైభవవర్ణనతో కథను ఆరంభించటం కవి యొక్క ప్రత్యేకత. “ఛందస్సుందరమైన వాక్కు ... ఛందమ్ము షట్పద...” (1-1,2) అని రెండు పద్యాలలో నిర్వహింపబడింది. చంపకోత్పల సౌగంధ్యంతో ఉద్గ్రంథంగా ఉంది అనడం అపూర్వ సంభావన. చంపకోత్పల పదాలు ఆశ్రమపరంగా వృక్షములు అని అర్థం. ఉద్గ్రంథపరంగా అవి ఛందో విశేషాలు. సరసమైన శ్లేష. వేద పఠనం, గానం, శాస్త్రార్థ చర్చ మున్నగువానిని తుమ్మెదలు, పుంస్కోకిలలు, శారికాకీర శాబకములు నిర్వహిస్తున్నాయి. సహజవైరంగల సర్వ జంతువులు సహజీవనాన్ని చేస్తున్నాయి. రెండవ పద్యంలోని “సహజ వైరమ్ము మరచిన సకల జంతు సంతతుల్ సహజీవన సరణి జూప” అనే వాక్యానికి వివరణ ప్రాయంగా రచయిత “వత్సమ్ములం గూడి పాలధారల గ్రోలు ...” (3-145) అనే వసిష్ఠాశ్రమ వర్ణనని నిర్వహించినాడు. ఆశ్రమాలు పరమశాంతరమణీయంగా ఉంటాయి అనే కవి భావన ప్రశంసనీయం.

రామాయణంలోని “కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్..” అని పెక్కు శ్లోకాలలో చెప్పబడ్డ అంశాలని డాక్టర్ ఉపాధ్యాయుల “ అరచేత విశ్వమ్ము నాటాడగా జేయు...” (1-8) అని ఒక్క సీస పద్యంలో రచించినాడు.

సంస్కృత సాహిత్యంలో తొలి శ్లోకంగా ప్రసిద్ధి పొందిన “మా నిషాద ...” అదే శ్లోకాన్ని “కామమోహితమైనట్టి...” (1-32) అని రచయిత గావించిన అనువాదం పరమ సుందరం. బ్రహ్మ రామాయణం రచనకు ప్రోత్సహిస్తూ వాల్మీకితో “యావత్ స్థాస్యంతి గిరయః ...” అది వాగ్దానం చేస్తాడు. ఆ శ్లోకాన్ని ఈ రచయిత “రసవంతమ్మగు..” (1-4) అని మత్తేభ వృత్తంలో మూలానికి మెరుగు పెడ్తూ అనువదించినాడు. రవిశశుల్ అనే ప్రయోగం విశేషం.

అయోధ్యలో లవకుశల గాన వైఖరిని కవి "నార చీరలు కట్టి నల్లపూసలు చుట్టి..." (1-49) అని అభివర్ణించినాడు. లవకుశల రూపం స్వభావ ప్రకటన పాత్రలని సాక్షాత్కరింపజేస్తున్నాయి.

రోమపాదుని రాజ్యంలో అనావృష్టిచే క్షామం ఏర్పడుతుంది. దాన్ని కవి "ఉదయమ్మాదిగ..." (1-101-104) అని నాల్గు పద్యాలలో వర్ణించినాడు. వర్ణన హృదయాన్ని స్పందింపజేస్తోంది. నేల బ్రద్దలయింది. మొగ్గలు మారిపోయాయి... అని "పటియల్ వారెను నేల..." (1-103) అనే పద్యం క్షామం యొక్క తీవ్రతను నిరూపిస్తోంది. ఈ క్షామ వర్ణన సర్వము అమూలకం. "అనావృష్ట్యాంతు వృత్తయామ్" అని మాత్రమే మూలం. "రాజా దుఃఖసమన్వితః" అనే వాక్యానికి వివరణగా కవి గావించిన వర్ణన సన్నివేశానికి ఉత్కర్షప్రదం.

వచ్చిన వేశ్యలను చూసి ఋష్యశృంగుడు ఆశ్చర్యచకితుడై "ఎవ్వరు మీరలిచ్చటకు నే పని పైబడి వచ్చినారలు" (1-25) అది ప్రశ్నిస్తాడు. ఇక్కడ శైలి సంవాదాత్మకం. ఆ పిమ్మట ఆ ఋషిపుత్రుడు "భళిరా మిత్రమ బాగు బాగు...) (1-133) అని ప్రశంసించిన రీతి గూడ సంభాషణాత్మకమే. భళిరా, బాగు బాగు అనే పదాలు సంభాషణలో సహజత్వాన్ని పోషిస్తున్నాయి. అనంతర కథలో శతానందుడు విశ్వామిత్రునితో తన తల్లి అహల్యావృత్తాంతం వివరింపుమని కోరినప్పుడు కూడా కవి "జనకుడు గౌతముండు...(3-137) అనే పద్యాన్ని కూడా సంవాద శైలిలోనే రచించినాడు.

విభాండకముని సాయంకాలం ఆశ్రమానికి వచ్చినప్పుడు కూడా సాయం సమయ విశేషాలని కవి "దినకరుడస్తమించె..." (1-146) అనే పద్యంలో పూస గ్రుచ్చినట్లు అభివర్ణించినాడు. నన్నయ్యగారి "వాడి మయూఖముల్ గలుగు వాఁడపరాంబుధి గ్రుంకె.." అనే పద్యానికి ఈ పద్యం సంవాదరచన అనదగ్గది. విభాండకముని హృదయంలో ప్రేమ అధికం కాగా పుత్రుణ్ణి పిలుస్తాడు. అక్కడ కవి "డెందమున నూల్కొను ప్రేముడి తీగసాగగన్" అని గావించిన పదముల కూర్పు రమణీయం. ప్రేముడి తీగసాగగన్ అనేది అనుపమమైన సాదృశ్యం. పుత్ర వాత్సల్యాతిరేక సూచకం.

పుత్రార్థియై యాగ నిర్వహణకి దశరథుడు సంసిద్ధుడు కాగా పట్టణం సమస్తమూ అలంకరింపబడిన రీతిని కవి "కస్తూరి కలయంపి కడు చక్కగా జల్లి..." (2-9) గావించిన వర్ణన హృదయంగమం. రచనలో పరిపక్వత ప్రస్ఫుటమౌతోంది.

దశరథుని నిండు గర్భిణులైన రాణుల స్థితిని " కారు మేఘము గుంపు..." (2-47) అది వర్ణించడంలో ప్రయోగించిన ఉపమలు పరమ రమణీయాలు.

కానక కన్న సంతానం కాబట్టి దశరథునికి పుత్రుల పై గల మమకారాన్ని రచయిత "రాచకార్యములందు..." (2-54) అనే పద్యంలో చక్కగా నిరూపించినాడు. ముద్దుకూనలు కన్నబిడ్డలు చిన్నిపాపలు అదే పదప్రయోగం అనురాగవ్యంజకాలు.

తాను తలపెట్టిన యాగ సంరక్షణకై రాముని పంపుమని విశ్వామిత్రుడు దశరథుని కోరిన రీతిని "రాముడు రాక్షసాంతకుడు..." (2-67) అని కవి రచించి-నాడు. రాముని అవతార తత్త్వం వ్యంగ్యంగా సూచింపబడింది. దాన నెల్లరకు దివ్యశుభంబులు గల్గు చెచ్చరన్" అనడంలో భావికథార్థబోధ చేయబడింది.

రాక్షస సంహారానికి రాముడు సమర్థుడు కాడని దశరథుడు విశ్వామిత్రునికి విన్నవించుకుంటున్నాను సందర్భంలో "చిక్కిన పాలు గారు నును చెక్కిలి..." (2-71) అదే పద్యం లోని ప్రతి పదమూ ఆతని పుత్రవాత్సల్య నిర్భరత్వాన్ని నిరూపిస్తోంది. పదబంధం పరమహృద్యం. ఆగ్రహించిన ఆ విశ్వామిత్రుని శాంతింపజేసి వసిష్ఠుడు ఆ ఋషి ప్రభావాన్ని ";ఆకృతి దాల్చు ధర్మ మిత డద్భుత శాస్త్ర విశారదుండు..." (2-83) అని వివరిస్తాడు. ఆ పద్యంలో విశ్వామిత్రుని వ్యక్తిత్వ సర్వస్వమూ నిరూపింపబడినది. "విగ్రహవాన్ ధర్మః" వాక్యానికి 'ఆకృతి దాల్చు ధర్మమితడు' అన్నది చక్కని అనువాదం.

ఒకవైపు ధనుస్సుని మరొక వైపు తూణీరాన్ని ధరించి వెళ్తుందా రామలక్ష్మణులకు కవి మూడు తలల సర్పరాజం బుసలు కొడ్తూ కదులుతున్నట్లుందని "ధనువొకవైపు..." (2-91) ప్రయోగించిన ఔపమ్యం అత్యంత రమణీయం. అద్భుతమైన భావన.

రాక్షసత్వాన్ని పొందక పూర్వం తాటక రూపం "కాంతులు చిందెడు చంద్రరేఖనాన్" అని అభివర్ణితం. చిందెడు ప్రయోగం పరమ సుందరం. ఈ ఔపమ్యం కూడా భావుకత్వాన్ని సూచిస్తోంది.

తాటకా రామచంద్రుల యుద్ధాన్ని కవి ఎంతో సమర్థతతో వర్ణించినాడు. "గిరి శిఖరమ్ములు..." (2-120) అదే సీస పద్యం లో పరస్పర విజిగీషని చక్కగా కవి పోషించినాడు.

వామనావతారకథలో వామనుడు బలిచక్రవర్తిని కేవలం మూడు అడుగుల నేలను మాత్రమే యాచించడాన్ని " మూడడుగుల వాడను నే మూడడుగులు కోరుకొనుట ముచ్చటయౌ" (2-138) అని సమర్థించడం అనిదంపూర్వమైన చమత్కృతి.

మిథిలా ప్రయాణం ప్రస్తావిస్తూ విశ్వామిత్రుడు శివధనుర్వృత్తాంతం "శివమై తాళ సమానమై ..." (3-6) అని వివరిస్తాడు. సుక్షత్రియుడైన రామునికి ధనుర్దిదృక్ష పెంచేటట్లు వర్ణన సాగింది.

కవుల ఉదాత్త భావనా పటిమకి వర్ణనలు పరమాధారంగా నిలుస్తాయి. విశ్వామిత్రుడు తన వంశ చరిత్ర చెబుతున్న సందర్భంలో సంధ్యా నిర్గమన నిశాగమన సన్నివేశాన్ని అవి అపూర్వ కల్పనలతో "చిరుగాలితరగల ..." (3-29) అది వర్ణించినాడు. కల్పన హృద్యానవద్యం. ప్రాచీన కవి రచనగా భాసిస్తోంది. సీస పద్య రచనలో కూడా అవి యొక్క పరిణత వెల్లడవుతోంది.

గంగావతరణ సన్నివేశంలో గంగ భూమిపై పడిన రీతి అనల్ప కల్పనలతో కవితామయంగా సాగింది. "మంజు మృదంగ తరంగరావమున్" (3-63) అనే పదప్రయోగం మృదంగ ధ్వనిని అనుభవింపజేస్తోంది. "వెండికొండ ద్రవించి వెస సాగి వచ్చెనా..." (3-64)వ పద్యంలోని భావాలు, పద ప్రయోగం కూడా ప్రబంధోచితంగా నిర్వహింపబడ్డాయి. ఆ సందర్భంలో గంగా ప్రవాహాన్ని "సర్వమోహనమ్మెన..." (3-65) అనే పద్యంలో వర్ణించిన రీతి కూడా కవి యొక్క ప్రతిభాపౌష్కల్యాన్ని నిరూపిస్తోంది.

క్షీరాబ్ధి మథనంలో ఆవిర్భవించిన హాలాహలానికి భీతిల్లి దేవదానవులు పరమేశ్వరుణ్ణి నుతించడాన్ని అవి "వరదా! భస్మవిభూషితా..." (3-88) అని రచించినాడు. భక్తి భావ నిర్భరమైన ఈ పద్యం ఒక శతక పద్యం వలె భాసిస్తోంది. నిత్యమూ ప్రార్థనగా చదువుకోదగ్గదే.

భర్తృ శాపవిముక్త యైన అహల్య రూప వైభవాన్ని కవి "హేమగుండము లోన..." (3-127) అని వివిధోపమలతో వర్ణించిన తీరు అత్యంత శ్లాఘనీయం. ఈ వర్ణన సర్వమూ కవియొక్క భావుకతకు ఉత్తమ లక్ష్యం అనదగ్గదే.

యుద్ధవర్ణనల నిర్వహణలో రవి యొక్క సమర్థత వసిష్ఠుని ధేనూత్పన్న సైన్యం విశ్వామిత్ర సైన్యాన్ని ఎదిరించడంలో ప్రదర్శింపబడింది. "మంత్రపూతమ్ములౌ..." (3-162) అనే పద్యం యుద్ధ సర్వస్వానికీ మణిదర్పణప్రాయం అనదగ్గది. అద్భుతంగా వీరరసం పోషింపబడింది.. సమస్తాన్ని కోల్పోయి నేలకూలిన విశ్వామిత్రుని అసహాయ స్థితిని కవి "రెక్కలున్ దెగిన పుల్గు గతిన్ ధర గూలె..." (3-164) అని అద్వితీయమైన ఉపమానంతో సూచించినాడు.

బాలకాండ లోని మేనకా విశ్వామిత్రుల ప్రణయం లోకప్రసిద్ధి పొందింది. కవి మేనకా సౌందర్య సంపదని "మబ్బును మబ్బు ఢీకొనగ..., పరిమళ పూరితమ్ము..." (4-35) అని రెండు పద్యాలలో అభివర్ణించాడు. "ఝల్లుమంచు నెద త్రుళ్లగ..." అనే పదాలు విశ్వామిత్రుని హృదయాన్ని ఆమె ఎంతగా ఆకర్షిస్తుందో తెలుపుతున్నాయి. వారి రమ్యానుభూతి "కరముల్ గైకొని.." (4-37) పద్యంలో మనోజ్ఞంగా వర్ణించబడింది. పదప్రయోగం ప్రాబంధికం. ఈ నాయికా నాయకుల రతిక్రీడానుభూతికి ఉద్దీపకంగా ముందుగా కవి వసంత వైభవాన్ని "మొలక చిగిర్చి..." (4-33) అనే పద్యంలో వర్ణించడం అత్యంత సముచితం. అభినందనీయం.

శివధనుర్భంగం సన్నివేశం కూడా బాలకాండలో ప్రశస్తి కెక్కినదే. రాముడు ఆ ధనువు ఎక్కుపెట్టగా విరిగినప్పుడు ఉద్భవించిన ధ్వనిని కవులు విభిన్న రీతులలో అభివర్ణించినారు. డా. ఉపాధ్యాయుల గౌరీశంకర రావు కూడా తన ప్రత్యేకతను ప్రదర్శిస్తూ "జలధుల్ నొక్కట కుళ్లగిల్ల..., ఆమహారవమోంకారమట్లు.."(4-66,

67) అని రెండు పద్యాలు రచించినాడు. ఆ ధ్వని ఓంకారం గా వెలువడి అంతటా వ్యాపించి పంచాక్షరీ మంత్రంగా పరిఢవిల్లిందన్న కల్పన పరమ రమణీయం. అది శివ ధనుస్సు కాబట్టి ఆ భావన అత్యంత సమర్ధనీయం.

రాముని అవతార నిర్వహణకి సీతాకల్యాణం ప్రాతిభూతమైన సన్నివేశం. వారి వివాహం మంగళసూత్రధారణతో తెలుగువారి సంప్రదాయానుసారమే నిర్వహించబడినది. తలంబ్రాల వేడుక తెలుగు వారికి ఎంతో ప్రీతికరమైనది. “జానక్యాః కమలమాలాంజలి పుటే...” అనే శ్లోకం బహుళ ప్రచారంలో ఉన్నది. దాని రచయిత “జానకి కేలు చెందొవల...” (4-111) అనే పద్యంలో చక్కగా అనువదించాడు. తెల్లని ముత్యాల తలంబ్రాలు సీత అరచేతిలో తమ్మికెంపులుగా రాముని శీర్షంపై తెల్లని మొల్లలుగా మేనిపై నీలములుగా అయి చూచువారికి ఆశ్చర్యం కలిగించాయి. అనువాదం యథామూలం. మన సుందరం. కేలు చెందొవలన్.. తమ్మికెంపులై అదే అచ్చతెనుగుపదప్రయోగాలు అందాన్ని చిందిస్తున్నాయి.

సీతారామ కళ్యాణ సన్నివేశంలో “ఇయం సీతా మమ సుతా...” అనే వాల్మీకి శ్లోకం పండితుల ని బాగా ఆకర్షించింది. బహువిదార్థవిశేషాలతో వ్యాఖ్యానింప బడుతోంది. ఆ శ్లోకాన్ని ఈ కవి “ఇయ్యది సీత నా దుహిత...” (4-114) అని అనువదించాడు. మూలానికి సన్నిహితమైన అనువాదం ప్రతి పదసార్థకమైన రచన.

పరశురామ గర్వభంగం ఈ సన్నివేశం కూడా బాల రామాయణంలో అత్యంత ముఖ్యమైనది. రాముని అవతారతత్త్వ ప్రతిపాదకమైనది. పరశురాముడు ఆగ్రహంతో రామునితో “శ్రీ రఘురామ నిన్గురిచి...” (4-124) అని నీ బలం శివుని విల్లు విరచుట. అప్పుడు జనించిన ఘోరధ్వని విన్నాను. నీ బలం చూపించి ఈ వైష్ణవ ధనస్సును ఎక్కువ పెట్టు అని ధనస్సు అందిస్తాడు. ఆ సందర్భంలో నిన్ గురుచి... బంలంబు గూర్చి... కూల్చుట గూర్చి... రవంబు గూర్చి ... అనే పదప్రయోగం రాముని మహిమను దానితోపాటు కవియొక్క రచనాశిల్పాన్ని కూడా ఆవిష్కరిస్తోంది. పద్యం అలవోకగా వెలువడింది. ఆ సందర్భంలో దశరథుడు భయకంపితుడై భార్గవునితో దీనంగా అతని ఆగ్రహాన్ని పురస్కరించుకుని “ప్రవాళము పైన కుఠారధారలా? తగదిది” (4-126) అది ప్రార్ధిస్తాడు. ఆ ఔపమ్యం అత్యంత శ్లాఘనీయం.

వివాహానంతరం సీతారాముల దాంపత్య మాధుర్యాన్ని నిరూపించే వారి ముచ్చట్లను చి|| గౌరీ శంకర రావు వర్ణించడం విశేషం. ఆ మూలకం. నూతన వధూవరుల సరసాలను "వనవాటిన్..." (4-141) అనే పద్యంతో ఆరంభించి పద్యాలలో పరమాహ్లాదకరంగా కవి వర్ణించాడు. భవభూతి ఉత్తరరామ చరిత్రలో పేర్కొన్న "కిమపి కిమపి మందమ్.." అనే శ్లోకానికి ఈ పద్యాలు వ్యాఖ్యాన ప్రాయాలు. కథా కాలం నాటి స్థితిని భావించడంలో కవి ప్రతిభ విస్పష్టమవుతోంది.

మేనమామ యుధాజిత్తుతో మాతామహుని ఇంటికి వెళుతున్న భరతు నుద్దేశించి కవి "మామ వెన్నంటె భరతుడు మహితగుణుడు" అని వచించినాడు. మహితగుణుడు అనే విశేషణం విశేషార్థం బోధకం. భరతుని గుణసర్వస్వబోధకం. అయోధ్యకాండ లోని భరతుని ప్రవృత్తి సర్వస్వాన్నీ తెలుపుతోంది. ఆ పదం బాలకాండనీ అనంతరం వచ్చే అయోధ్యకాండనీ అనుసంధానం చేస్తోంది. అది రచనా శిల్పానికి చెందిన మెలకువ.

కావ్య రచనలో సూక్తులు సువర్ణ ఆభరణాలలో మనుషులు పొదుగడం వంటివి. సన్నివేశానికి శోభనిస్తాయి. పాఠకునికి లోక వ్యవహారజ్ఞానాన్ని అనుగ్రహిస్తాయి. లోకజ్ఞుడు, అనుభవశాలి అయిన కవి సందర్భ సముచితంగా సూక్తులని ప్రయోగిస్తాడు. వాల్మీకి దానికి మార్గదర్శకుడు. నన్నయాదుల అనుసరించారు. ఈ రచయిత కూడా "కర్మఫలంబు తొలంగ సాధ్యమే" (1-154), "క్షణమాత్రంబున తల్లక్రిందులగుసూ కాలమ్ము వక్రించుచోన్" (3-108) వంటి సూక్తులని ప్రయోగించి కథకు పుష్టిని చేకూర్చినాడు.

సర్వలఘు కంద పద్య రచనలో పోతన ప్రసిద్ధుడు. సాహిత్యంలోని మెలకువలు తెలిసిన వాడు కాబట్టి చిరంజీవి గౌరీ శంకర రావు కూడా "అడుగులు తడబడ..." (1-122) "జనకుడు ముని నడుగగ..." (3-133) అని పోతన మార్గాన్ని తన బాలకాండ రచనలో అనుసరించినాడు.

చక్కని అచ్చ తెనుగు పదాలను ప్రయోగించి రచయిత తన ప్రత్యేకతను నిలుపుకొన్నాడు. "పోటుమగడు, ముదల గట్టువిలుతుడు, సింగపుకూనలు, చిట్టిచెల్లి, ముక్కోల, గరికపూసలకొసల, ఆరగ్రోలి, చిరుగజ్జెలు, బంగారు జిలుగు,

బిగువు సడలని కండలు, చెరుగాలిమొరమొరల్, చెరునవ్వువెన్నెలల్, సౌరు, వెన్నెలరేరాజు, వేడివెల్లులరేడు, అన్నులమిన్న మున్నవి ఎన్నో పద్యానికి సొగసుని చేకూరుస్తున్నాయి. దేవుడు, ఆఘమేఘాలు వంటి వ్యవహార ప్రాచుర్యం గలవి కూడా చక్కగా కవి ప్రయోగించినాడు. పశ్యతోహరుడు వంటి సమాసాలు కూడా రామణీయకాన్ని చిందిస్తున్నాయి.

డా. ఉపాధ్యాయుల గౌరీశంకరరావు ఈ గ్రంథ పీఠికలో "చదువరి కర్థమైన కవిచాతురి మన్ననలందు" అని పేర్కొన్న విధంగానే ఈ బాలకాండం సహృదయ హృదయంగమంగా, సుమనోజ్ఞంగా, శబ్దార్థ చమత్కృతి సంభరితంగా, శ్రవఃపేయంగా రచించి కృతకృత్యుడైనాడు. ఇతర కాండలలో కూడా అనతికాలంలోనే అనల్ప ప్రజ్ఞా వైభవంతో రచించి రామానుగ్రహ పాత్రుడు కావాలని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను. సహృద పాఠకులు ఈ శ్రీరామ కథా మకరందాన్ని ఆస్వాదించి తరింతురు గాక!

శుభం భూయాత్

ఇట్లు
విద్వజ్జన విధేయుడు
వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

తేది. 20.9.22

# పీఠిక

శా. శ్రీకారుణ్య పయోనిధీ! రఘువరా! సీతాపతీ! ధీమతీ!
కాకుత్స్థాంకుర! భక్త కోటి సులభా కారుణ్య !విశ్వేశ్వరా!
రాకా చంద్ర నిభాస్య! నీదుకథలన్ రమ్యాతిరమ్యమ్ముగా
లోకానన్ వెలయించినాడ గొనుమా రోచిష్ణు! మోదమ్మునన్ 1

మ. మకరందంబిది రామగాథ జగతిన్ మాధుర్యమై యొప్పు తా
రకమంత్రమ్మగు రామనామ మిలలో రక్షించు జన్మమ్ము మే
చకవర్ణుండగు చాపధారి తలపుల్ సాయుజ్యమిప్పించు మా
మక చిత్తంబును దాన లగ్నమగుటే మాన్యత్వమున్ గొల్పెడిన్ 2

కం. జీవుని వేదన బాపెడి
జీవ రసాయన గుళికలు శ్రీరామ కథల్
పావన తారక మంత్ర స
జీవనసాక్ష్యమ్ములివ్వి శ్రీకరమగుచున్ 3

కం. రామ కథా గానమ్మున
మామక జననమ్ము ధన్యమయ్యెడి ననుచున్
శ్యామలతత్త్వ విభాసిత
ధీ మత్త్వముతోడ దీని తెనుగొనరింతున్ 4

ఉ. పెద్దలు చేయు పుణ్యమున విద్య యొకండది యబ్బెనాకు నా
విద్దె యసంగతమ్మునగు వేషము వేయక మోక్ష సిద్ధి ము
ప్పొద్దుల గోరునట్టి యొక బుద్ధిని రేపెను,దానజేసి యీ
పొద్దున రామభద్రు నవమోహన గాథను విందుజేసెదన్ 5

శా. ఏ యానందము నిత్యమై నిఖిలమై సృష్ట్యంత పర్యంతమై
మాయాచ్ఛేదన మూలమై సుగతికిన్ మార్గమ్మునై యొప్పునో
ఆ యానందపు రూపమున్ నుడివెదన్ హర్షాతిరేకమ్ముతో
నా యాస్యంబున నిల్చి రమ్యఫణితిన్ నర్తింపవే భారతీ! 6

చం. అనిశము రామనామ మధురామృతధారలు గ్రోలువాని లం
కిణి బరిమార్చి రావణుని గీమును కాల్చిన వాని జానకిన్
గని శుభవార్త రామునికి గ్రచ్చర చెప్పిన వాని నంజనా
తనయుని తీక్ష్ణతేజుని స్వధర్మ వరిష్ఠుని ప్రస్తుతించెదన్ 7

మ. ఘనునిన్ శ్రీహరి డెందమందు నిడి లింగాకార తత్త్వమ్మునై
కనులం దోచు మహేశురీతి ధర శ్రీగంధమ్ము లింగాకృతిన్
జినుడై మైనిడి భక్తకల్పతరువై సింహాచలాధీశుడై
గననౌ చందనమంగళాకృతిని లింగాకారు ప్రార్థించెదన్ 8

సీ. మునివాటి నానొప్పు "మురగడాం"గ్రామమ్ము
స్వర్ణ ముఖీ నది పసిడి తట్టు
కర్షక తత్త్వమై "కౌండిన్య" గోత్రమై
బరిగె "ఉపాధ్యాయ"వంశ మొకటి
సత్య కాలము వాడు సౌమ్యశీలమువాడు
"నారాయణా"ఖ్యుండు నవ్య ఋషియ
"సూర్యకాంతమ్మ"ను భార్యగా చేపట్టి
బహుకుటుంబీకుడై బరగియుండె

తే.గీ. వారి యష్టమ గర్భాన వరలినట్టి
గౌరిశంకరుడనువాడ శారదాంబ
దయను జేసియ తెలుగు పద్యాలనల్లు
మర్మమెరిగితి లోకమ్ము కూర్మిజూప. 9

సీ. సగభాగమై నిల్చి సంతానమును గూర్చి
వరలక్ష్మి లక్ష్మియై వరలుచుండ
జ్యేష్ఠుడై సంతాన శ్రేష్ఠుడై యొప్పారె
నతివతో శ్రీకాంతు డార్థికమున
భార్యతో భోగాల వార్ధిలో తేలెడి
నరసింహమూర్తి మా చిరుతవాడు
ఆదర్శగృహిణియై యమ్మయై యలరారు
శ్రీతేజ మాయింటి చిట్టితల్లి

తే.గీ. కలిమి లేముల కావడి కడిమి గూర్చి
మధుర దరహాస చంద్రికల్ మలగకుండ
మధుర కవి నేను మంకరంద మధుర రుచులు
తెలుగు నేలను పంచంగ పలుకుచుంటి 10

కం. మధురముగా మధురాక్షర
కథనముగా రామనామగానముచేసెన్
మధుకోకిల వాల్మీకియు
మధుకవితా శాఖినెక్కి మంజులఫణితిన్ 11

సీ. భారతభారతీ భాగ్యంబు కైసేయు
కవిఋషిత్రయమును గారవించి
శృంగార రసధుని శ్రీనాథు నర్చించి
భాస్కరసోముల భాగ్యమరసి
మోక్షసమ్రాట్టునౌ పోతన్న పూజించి
పెద్దన్న పెద్దన్న వినుతిచేసి
రామకృష్ణుని రామరాజును భూషించి
ముక్కుతిమ్మన పల్కు మూదలించి

తే.గీ. సుమతి బద్దెన గోపన సోమకవిని
వేమయోగిని ధూర్జటి విమలచరితు
అన్నమయ్యను హరికథలాదిభట్టు
తెలుగు కవిదిగ్గజమ్ముల తీరుదలచి 12

తే.గీ. నవ్య సాహిత్య వీథులనడుచునట్టి
తెలుగుతల్లికి కన్నులై వెలుగులీను
విశ్వనాథుని శ్రీశ్రీ ని వినుతి చేసి
ఆధునిక కవిలోకమ్ము నాదరించి 13

చం. చదువరి కర్థమైన కవి చాతురి మన్ననలందుగాని యా
చదువరి తెల్లవోవ కవిచాతురి బూడిద బుంగయౌ సుమీ
పదువురు నారగింప ఫలవంతము నందును విందుభోజనం
బది యొకరిద్దరుం గుడువ వ్యర్థము గాదొకొ యెంచిచూడగన్ 14

ఉ. జిల్లెలమూడి తల్లి దయచేసిన యక్షరభిక్షయిద్ది యా
చల్లనితల్లి వీక్షణల సాగిన జీవన యానమిద్ది సం
ధిల్లిన విద్యలున్ హృదయతీరము చేరిన సారమిద్ది యా
నల్లని వాని మోక్షసదనమ్మునుచేరెడి చిత్తమిద్దియౌ 15

మ. వరుడౌ వేదులవంశభూషణుడు సుబ్రహ్మణ్యశాస్త్ర్యాఖ్యుడున్
గురుపాదుండునుసంస్కృతాంధ్ర చణుడున్ కూర్మిన్ ప్రబోధించె నీ
సరసమ్మౌ రుచిమంతమౌ కవనమున్ సన్మార్గమున్ సాగుచో
స్థిరమౌమన్ననలందునంచు బహు రాశీభూత పుణ్యంబునన్ 16

చం. చతురుడు తూములూరికుల చంద్రుడు యాంత్రిక శాస్త్రవేత్త సం
తత ధరహాసశీలి బహు ధార్మికుడై మకరంద కావ్యమున్
హితకరుడౌచు దాని ప్రచురింపగ నెంచెను తల్లి వారలన్
సతతముబ్రోచుగావుత వెసన్ మురళీధర శర్మగారలన్ 17

చం. పరమ పవిత్రమైన సురవాహిని స్నానముకోరుకొందురీ
భరతమహీస్థలాన గలవారలు జీవితమందు నట్టులే
పరమపవిత్రమైనరఘువంశ్యుని గాథను పాడుచుందురీ
భరతధరాస్థలిన్ కవులు వాఙ్మయ వైభవముల్లసిల్లగన్ 18

ఉ. రామపథమ్ము మించు నవరాగ పథమ్మును,ధర్మబద్ధమౌ
రాముని గాథమించు జనరంజక మయ్యెడిగాథ,దివ్యమౌ
రాముని నామమున్ గడచి రాజిలు తారక మంత్రరాజమెం
దీ మహి లేదుగాన రచియించితి నే మకరంద మాధురిన్ 19

కం. రామా రామా రామా
రామా రామా యటంచు రాముని నామం
బాముష్మికఫలరసమును
రామార్పణమనుచు గ్రోల రససిద్ధియగున్ 20

## గురుస్తుతి

ఉ. అక్షరభిక్షపెట్టి మధురాక్షర పాళిక చూపి దివ్యమౌ
అక్షరసారమున్ నుడివి యక్షయమౌ మధురంపువాక్కులన్
శిక్షణనిచ్చి నన్ను వికసింపగ జేసిన యెందరెందరో
శిక్షకులౌమహాత్ములకు శీర్షము వంచినమస్కరించెదన్

డా|| ఉపాధ్యాయుల గౌరీశంకర రావు
E-2, Vasudeva Vaibhav,
1st Lane, Padmavathi Nagar,
Vepagunta Post
Visakhapatnam – 530047
Phone: 9550231590

# శ్రీరామ కథామకరందము

## *బాలకాండము*

## ప్రథమాశ్వాసము

శ్రీ రఘుకుల జలనిధి సో
మా! రాక్షసకుల విరామ! మంజులనామా!
కారుణ్యామృత ధామా!
దారుణసంగ్రామ భీమ!ధార్మికసీమా! 1

శా. కాండమ్మొక్కటి కావ్యమైతనర రాకాపూర్ణ చంద్ర ప్రభా
ఖండమ్మట్టుల రామగాథలలరన్ గానమ్ముగావింతు వే
దండాస్యా! గిరిజాసతీ హృదయ పద్మార్కా! గణాధీశ! కై
దండల్ కూర్పుము విఘ్నహంతవయి కైతల్ వేగుబాళింపగన్ 2

మ. ఇదిగో పచ్చలకంబళిన్ పరిచితో యీమూల నిద్దాన నీ
పదముల్ చేర్చి సుఖాసనుండవగుమీ భాస్వంత! యోపావనీ!
నదియై సాగెడి రామగాథ మకరందమ్మొచు పొంగారె నా
హృదయస్థానమునుండి దాని వినుచున్ తృప్తిన్ ననున్ గావవే 3

కం. రామకథా మకరందము
సామాన్యుల కర్థమైన చాలును మఱియా
ధీమాన్యులు తలయూచుట
రామకథా గరిమకాదె రమణీయతకున్ 4

## వాల్మీకి ఆశ్రమ వర్ణన

శా. ఛందస్సుందరమైనవాక్కు విలసచ్ఛాస్త్రార్థ సంపత్తి యా
నందోద్భూత కథా ప్రశస్తి భగవన్నామామృతాస్వాదనల్
సౌందర్యావహ చంపకోత్పల మహా సౌగంధ్య సంవ్యాప్తి చె
న్నొందెన్ శ్రీముని వాటి యొండనఘమై యుద్గ్రంథ మన్నట్లుగన్. 1

సీ. ఛందమ్ము షట్పద బృందమ్ము షడ్జమ
స్వరమున గానమ్ము సలుపుచుండ
హరినామగానమ్ము నమృతస్వరజతి పుం
స్కోకిల తండమ్ము కొసరిపాడ
శాస్త్రార్థ తత్త్వంబు శారికాకీర శా
బక పంక్తి ముద్దుగ పలుకుచుండ
ఆనందమును గూర్చు నద్భుతగాథల
మైనగోరలదండు మరలతెలుప

తే.గీ. సహజ వైరమ్ము మరచిన సకలజంతు
సంతతుల్ సహజీవన సరణిజూప
ఒప్పె వాల్మీకి నానొక్క గొప్ప సంయ
మీంద్రు పర్ణవాటిక పరమేష్ఠి పీఠి 2

తే.గీ. ఉదయసంధ్యా తపఃకర్మ హోమతతులు
నిత్యనైమిత్తికమ్ములు నియతి గూర్చి
ఛాత్రవర్గంబుతోడుత శాస్త్ర చర్చ
నొప్పె వాల్మీకి మౌనీంద్రు డొక్కనాడు 3

కం. నారాయణ మంత్రాక్షర
పారాయణశీలి విశ్వవంద్యుడనఘుడా
నారదుడఖిల భువన సం
చారుడు వే చుక్కరాలు సరణిని వచ్చెన్ 4

ఉ. వాకిట నిల్చు నారదుని భక్తియుతమ్ముగ స్వాగతించి పూ
రేకుల గద్దెపై నునిచి శ్రీపతి దల్చుచు నర్ఘ్యపాద్యముల్
తేకువనిచ్చి దేవముని దివ్యపదమ్ముల పూజచేసె వా
ల్మీకియు శిష్యబృందమునుమిక్కుటమౌ వినయమ్ము చూపుచున్ 5

తే.గీ. అతిథిమర్యాదలందినయమరమునియు
సంతసమ్మున దీవించె సకల శిష్య
సంఘయుతుడైన వాల్మీకిసంయమీంద్రు
హరి కటాక్షసంసిద్ధిరస్తనుచు నంత 6

మ. క్షణమాత్రమ్మున లోకముల్ తిరిగి తచ్చారిత్రముల్ తెల్పుచున్
జనకల్యాణము కాంక్షచేయుదురు మీ సౌజన్యసంపత్తి,యో
మునిమాన్యా! యొక సందియమ్ము మదిలో మొల్కెత్తె పెక్కేండ్లుగా
విని యద్దానిని తీర్పవే యనుచు దెల్పెన్ మునీంద్రుండు దాన్ 7

సీ. అరచేత విశ్వమ్ము నాటాడగాజేయు
సత్త్వసంపన్నుడౌ స్వామి యెవరు
ధర్మసంరక్షణ ధర్మనిర్వహణాన
సర్వంబుత్యజియించుస్వామియెవరు
జనరంజకుండౌచు జనమోహనుండౌచు
చారిత్రకుండైన స్వామి యెవరు
సచ్ఛీలవంతుడై సజ్జన దాంతుడై
సత్యమ్ము తప్పని స్వామి యెవరు

తే.గీ. మేలుమరవనివాడు తా మేలుకూర్చు
వాడు కోపమ్ము త్యజియించు స్వామి యెవరు
వాని చరితమ్ము వినునట్టివాంఛయొకటి
కలిగె నద్దాని తీర్పంగ గలరు మీర! 8

శా. పుట్టంబుట్టినమౌని యట్టులడుగన్ మోమంత పంకించి స
ద్ఘట్టమ్ముల్ భువి పెక్కులుం గలవుపో గాకున్న నేయొక్కటో
పట్టున్ దిట్టల ధర్మబద్ధ చరితన్ భావ్యంబు గావన్ని యీ
పట్టున్ ధర్మనిబద్ధు డెవ్వడనుచో వైకుంఠుడే యోగ్యుడౌ 9

## బాల రామాయణము

మ. అయినన్ చెప్పెద నొక్కగాథ వినుమో యాచార్య వాల్మీకి నా
దయినన్ జ్ఞానము చేసి యీభువనగాథా తోయధుల్ ద్రచ్చుచో
జయశీలమ్మగు రాఘవాంబుధిని సత్సాధ్యుండు ధర్మజ్ఞుడున్
భయదూరుండు దయాపరుండు వరలెన్ పౌలస్త్య సంహర్తయై 10

ఉ. రాముడు లోకమోహనుడు రమ్యగుణాకరు డాత్మవేది శ్రీ
ధాముడు సత్త్వమూర్తి రణధర్మ వరిష్ఠుడు వార్షుకాభ్రస
చ్ఛ్యామల కోమలుండు నిజశాసనశాసితు డార్షపూజితుం
డౌ మునివర్య!యా దశరథాత్మజు డభ్యుదయంబు నొందెడిన్ 11

మ. ధర నైక్ష్వాక తపఃఫలంబు నగుచున్ ధర్మస్వరూపంబునై
వర యజ్ఞంపు మహాఫలంబు నగుచున్ బ్రహ్మప్రకాశంబుతో
ధరణీ భార వినాశకుండు నగుచున్ స్థైర్యంపు రూపంబునై
నరుడై రాఘవుడై జనించె భువిపై నారాయణుండంతటన్ 12

మ. ముని జన్నంబును గాచి మౌని సుదతిన్ మోహాంధకారాన్వితన్
ఘన పాషాణము పాదధూళిని శుభాకారమ్ము చేకూర్చి యా
జనకాధీశుని వాంఛచేసి శివమౌ చాపంబు ఖండించి భూ
తనయన్ సీతను పెండ్లియాడు తనదౌ దర్పంబు రాజిల్లగన్. 13

చం. జనకుని పంపునన్ సకల సౌఖ్యము లెల్లను వీడి యట్టులే
వనమును జేరె తమ్ముడును భార్యయు తోడయి వెంటనంట నా
వనమున రాక్షసాధముల బాధ తొలంగగజేసి సత్త్వుడై
మునిహితకారియై వరలె పుణ్యజనమ్ముల కంటగింపునై. 14

ఉ. రాముని శ్యామసుందరుని రక్కసు రావణు చిట్టిచెల్లి వే
కామన సేయ, క్రోధమున కాముకి బట్టుచు కర్ణనాసికా
సీమల నుత్తరించె గుణశేఖరుడైన సుమిత్ర సూతి; యా
లేమయు రాక్షసేశు నదిలించెను సర్వము వెల్లడించుచున్. 15

ఉ. బంగరు లేడికూన ముని వాకిట గంతులు వేయుచుండ రా
మాంగన కోరె ప్రీతిమెయి నవ్వనితా మణి కోర్కెదీర్ప దా
చెంగున దూకె రాఘవుడు చింత యొకింతయు చేయకున్న నా
బంగరు మాయలేడి తెగపారె వనమ్మున చెంగుచెంగనన్ 16

ఉ. రాక్షస మాయకున్ భ్రమసి రాఘవు డట్టుల సాగిపోవ స
ద్భిక్షుక వేషమున్ దవిలి వేగమ జానకి దొంగిలించె నా
రాక్షస చక్రవర్తి రఘురాముని యాశ్రమ వాటిజొచ్చి, శ్రీ
రక్షకుడైనగాని విధి వ్రాతలు మార్ప నసాధ్యమయ్యెడిన్ 17

మ. సతి జాడల్గన దమ్ముతోడ నటవీ సంచారముల్ చేయ న
య్యతిరాడ్రాముడు వృద్ధయౌ శబరిదౌ యాతిథ్యమున్బొంది యు
ద్ధతి లంకాపతి తోడపోరి తెగి సంత్రాసిల్లు గృధ్ధమ్ముకున్
చితి సాంగత్యము గూర్చి సీతకొరకై చింతించుచున్ బోవుచోన్. 18

మ. ఘనునిన్ మారుతి నాదరించి కపిసంఘస్వామి సుగ్రీవుతో
మును స్నేహమ్మునుజూపి వానరపతిన్ ముల్కోల శిక్షించి త
ద్వన రాజ్యమ్మును కట్టె మిత్రునకు సర్వస్వమ్ము చేకూర్చి భూ
తనయాన్వేషణ చేయ పుచ్చెకపులన్ ధాత్రీస్థలిన్ జుట్టగన్ 19

మ. కపి సంఘమ్ములు భూమి నెల్లెడల రాకాచంద్రబింబద్యుతిన్
అపలాపింపగ చేయు సీత రుచికై నన్వేషణల్ చేయుచో
కపిరాట్సూనుడు సుందరుండు లఘువై కంధిన్ విలంఘించి యా
తపమున్ స్రుక్కిన కొమ్మనా వరలు సీతాసాధ్వి వీక్షించెడిన్. 20

శా. భల్లూకమ్ములు వానరాళి యొకటై వారాశి బంధింప త
త్కల్లోలాంబుధి దాటి లంక నిలచెన్ గంభీరముద్రాంకుడై
ఫుల్లాబ్జాస్యుడురాముడంత, శరణమ్మున్ వేడె వే వచ్చి యే
తల్లంకాపతి తమ్ముగుఱ్ఱ దయతో దానిచ్చె లంకాస్థలిన్ 21

మ. నగముల్ ఢీకొనునట్లు నొండొరుల సేనా వాహినుల్ పోర ము
జ్జగముల్ భీతిల రావణాసురునితో క్ష్మాధీశు పోరాడె యా
రగడన్ నెత్తురుటేరులై పొరలె పారావారముప్పొంగె రే
వగలున్ నాట్యముచేసె మొండెములు బీభత్సమ్ము నిండారగన్. 22

చం. సుతహిత మిత్రబాంధవులు శూరులు వీరులు దండనాథులు
న్నతబలు లాప్తసోదరు లయాచిత రాఘవ కోపవహ్నిలో
హుతమయి పోవువేళ మరణోత్సవమందున భగ్నశీర్షుడై
గతవిభవమ్ముతోడ దశకంఠుడు చేరెను రుద్రభూమికిన్. 23

ఉ. నిప్పుల తేరునెక్కి పయనించుచు వచ్చిన జానకీ సతిన్
చప్పున చేయిపట్టి తన సన్నిధి గూర్చి ప్రఫుల్లహాసుడై
యొప్పెను రామభూవిభుడు నూర్జిత సత్త్వుడు, పుష్పకమ్ముపై
యప్పురవాటి వీడుచు రయమ్మున చేరె నయోధ్య రాజ్యమున్ 24

మ. జనసందోహము సంబరంబొరయ నాసామంత మంత్రాంగముల్
ఘన సంభార మహోత్సవమ్ము జరుపన్ గారుణ్యగంభీరుడై
వినయమ్మొప్ప ధరించె రాజ్యపదవిన్ విశ్వమ్ము జేకొట్టగా
ననుజుల్ తల్లులు బంధుమిత్రము లమందానందమున్ బొందగన్. 25

చం. ఫలములతోడ వృక్షములు పంటలతోడుత భూమిఖండముల్
జలములతోడ వాహినులు చల్లని వెన్నెలతో డి రాత్రులున్
బలము గలట్టి మానవులు భాగ్యవిరాజ గృహాంగణమ్ములున్
కలిగెడు రామరాజ్యమున గల్గదు మృత్యువు శత్రుభీతియున్. 26

మ. అని శ్రీరాముని దివ్యగాథ మధురమ్మౌ వాక్యవిన్యాసమున్
ఘనుడా నారదమౌని తెల్పి జనుచో కాలానుగుణ్యమ్ములౌ
పనులం దేలుచు రామగాథ యెదలో భావించి యానంద మో
హనుడై విష్ణు విశేష లీలలను తా ధ్యానించె వాల్మీకి యున్. 27

## రామకథ రచింపుమని బ్రహ్మతెలుపుట

కం. తమసానది జలములలో
విమలస్నానమ్ము సేయ వెడలెను వాల్మీ
కి మునీంద్రుడు శిష్యులతో
కమలాప్తుడుగగనమునడికదిలెడువేళన్ 28

సీ. చిగురుటాకుల శోభ చెలగెడి తీవియల్
రాగమంజరులౌచు తూగువిరులు
గరికి పూస కొసల మరకత రత్నాలు
నీటిచుక్కల పెల్లు నివ్వటిల్లు
అరవిచ్చి కెందమ్మి యధరపుమధురాలు
క్రొన్నీటి మడుగుల క్రొత్తకళలు
మధుర పరిమళ మలయమారుతసేవ
పుప్పొడి నేలల పులకరింత

తే.గీ. పసుపు కుంకుమ రేఖలు పొసగునట్టి
నవ వసంతపు జలములు సవదరించి
బరగె తమసానదీ విభవమ్ములు నడి
ప్రొద్దు వేళల వెలుగులు పొటమరింప 29

ఉ. రాగము తోడ రంజిలెడి క్రౌంచి మనంబును గెల్చి ప్రేమతో
తూగుచు మోహసంభ్రమున దోగెడి క్రౌంచము నొక్కబాణమున్
వేగ నిషాదుడేయ విలపించుచు నయ్యది నేలగూలె; ను
ద్వేగ విషాదశోకభయ పీడిత క్రౌంచియు గోలపెట్టెడిన్. 30

తే.గీ. క్రౌంచ మిధునంపు టార్తిని కనుల జూచి
కరుణతోడుత చిత్తమ్ము కరిగి పోవ
వ్యాధు చెయ్దుల దౌష్ట్యమ్ము బాధకలుగ
పలికె వాల్మీకి యంతనా వ్యాధుతోడ. 31

తేగీ. కామమోహిత మైనట్టి క్రౌంచమిధున
మందు జంటబాపితివయ్య :పొందబోవు
శాశ్వతమ్మైన స్థానమ్ము సకలభువన
సముదయమ్మందునోయినిషాదయనుచు. 32

ఆ.వె. అక్షర గణబద్ధమౌచు తంత్రీలయ
కలిత మధురగాన గరిమయగుచు
శోక చిత్తమందు శ్లోకంబు పుట్టెనే
యనుచు మౌని విస్మయమ్ము నందె 33

కం. ఛందోమయ భారతియై
స్పందించెను డెందమనుచువాకొను మునికిన్
వందనమిడి శిష్యుండా
నందము తో దాని బుద్ధి నాటెన్ వేగన్ 34

మ. భగవన్నామము నాల్కపై నిలిపి యా వాల్మీకి చన్నీటిలో
తగ స్నానంబొనరించి యాశ్రమమునన్ ధ్యానంబునన్ నిల్చుచో
ఖగరాడ్దైన్యము కండ్లకట్ట మనమున్ గాసిల్లి తచ్ఛ్లోకమున్
మగుడన్ దల్చుచు శోక విభ్రమమునన్ మత్తిల్లి మూర్ఛిల్లెడిన్. 35

ఉ. అట్టి యొకానొకందు స్థితి నద్భుత మైన ప్రకాశమొందు క
న్పట్టెను శారదావిభుని బ్రహ్మయ రూపము నంది; మౌనియున్
పెట్టెను జోత, ధాత యరవిచ్చిన నవ్వులపూలుజల్లి మో
మట్టిటు త్రిప్పిచూచి మధురామృతధారలు జార పల్కెడిన్ 36

ఉ. నిక్కము నీవుపల్కినది నీదగు నూహయథార్థమయ్య నీ
వాక్కు రసాన్వితమ్ము గణబద్ధము శ్రావ్యము సుమ్ము సామపున్
బుక్కులబోలు వాక్కుల మహీపతి రాముని దివ్యగాథ వే
చక్కగబల్కి లోకమున చాటుము జాతి హితమ్ము గోరుచున్. 37

కం. శ్రీరఘు రాముని గాథయ
నారదముని మధురపువచనమ్మున సర్వ
మ్మారసితి కదా దానిని
చారువుగా చెప్పుమయ్య సంతసమొప్పన్ 38

మ. మనమున్ కట్టడిసేసి బుద్ధికథపై మళ్ళించి యేకాకివై
కనులన్ మూయుచు రామగాథ పలుకన్ గంగాప్రవాహమ్మునై
కొనసాగున్ సుకుమార శబ్దగతితో గోక్షీరతుల్యమ్మునై
జనసామాన్యపు పుణ్యతీర్థమగుచున్ సౌందర్య సంభారమై. 39

ఉ. అట్టుల పల్కుచుండగ రహస్యము లన్నియు తేటతెల్లమై
కట్టెదుటన్ జరుంగునటు కళ్ళకు కట్టును ,పాత్రమూలపున్
గుట్టు లెరుంగవచ్చు పలుకుల్ పస హెచ్చు ను ,ముఖ్యఘట్టపున్
పట్టులు సానుకూలమగు వాస్తవముల్ కథనమ్ము నయ్యెడిన్. 40

మ. రసవంతమ్ముగ యోగదృష్టిగనుచున్ రామాయణంబల్లుచో
నెసగున్ కావ్యపరీమళమ్ము ధరణిన్ దృష్టాంతమై యొప్పుచున్
వసుధన్ పర్వత సూర్యచంద్ర తతులున్ వర్తిల్లునందాక నీ
వసుధాభర్త మహాచరిత్ర ఘనమై వర్తిల్లు నెల్లప్పుడున్. 41

తే.గీ. అటుల కర్తవ్య బోధన మాచరించి
సత్యలోకమ్మునకు నేగె సరసిజుండు
పులకితాంగుడు నయ్యెనా పుట్టకొడుకు
నాల్కయందున భారతి నాట్యమాడ. 42

సీ. మధుర మృదంగమా మహిజారు గంగాత
రంగమా శబ్ద పారమ్యగరిమ
విమల గాంధర్వమా విజ్ఞాన తీరమా
శబ్దార్థ సంయోగ సరసవృష్టి
మధు మకరందమా మాకంద పేశమా
కమనీయ గంభీర కవనధార
అక్షర శిల్పమా అక్షయభాండమా
నళినసంభవురాణి నాట్యగరిమ

తే.గీ. పలుకు పలుకున సుకుమార ఫణితిదోప
ద్రాక్ష ఫలపేశ సమమౌచు తరగలెత్తె
పరమపావన శ్రీరామ భవ్యగాథ
అంతవాల్మీకి ముఖమున సంతసమున 43

మ. జననమ్మాదిగ రావణాసురవధ స్వారాజ్య పట్టాభి షే
చన పర్యంత కథా విభాగములతో సంధిల్లు శ్రీరామ గా
థను వాక్రుచ్చెను యోగదృష్టిగనుచున్ ధర్మైక నిష్ఠాత్ము రా
ముని నిర్యాణ విశేషగాథ తెలిపెన్ పుణ్యుండు వాల్మీకి తాన్ 44

మ. సమరూపుల్ సమయౌవనుల్ సమకళా సాహిత్య నిష్ణాతులున్
సమకంఠస్వర గానకోవిదులు భూషాలంకృతుల్ సోదరుల్
సమతేజుల్ వరశిష్యులౌ కుశలవుల్ సంఘాన రామాయణం
బమరం గానముసేయుమంచు ముని యాహ్లాదంబునన్ బంపగాన్ 45

మ. గురువాత్సల్య విశేషలబ్ధులగుచున్ గుర్వాజ్ఞపాటించి త
ద్గురు కావ్యంబును సామవేదమటులన్ ఘోషించి రవ్వార లా
యురుగాథల్ విపులాంగ గాంగఝరియై యుప్పొంగి పెన్వీచులన్
ధరణీచక్రము నాక్రమించె ప్రజ తాదాత్మ్యమ్మునన్ మున్గగన్ 46

చం. కవి హృదయమ్ము గుర్తెరిగి కమ్మని కంఠము విప్పి కావ్యమున్
లవకుశు లిర్వురున్ దగువిలాసముగా పఠియించుచో తపో
భువనము లేమి యీ సకల భూస్థలి మెచ్చుచు నంజలించుచో
కవనము సేయునట్టిముని గౌరవ మెట్టిదొ చెప్పశక్యమే 47

కం. ముని పల్లెలు జనపదములు
ఘననగరములన్ గమించి కవలలయోధ్యా
జనరాజ్యము చేరుకొనిరి
ఘనమౌ శ్రీరామచరిత గానము సేయన్ 48

సీ. నారచీరలుకట్టి నల్లపూసలు చుట్టి
రుద్రాక్ష మాలల ముద్రనద్ది
చిరుగజ్జెలను కట్టి చిటితాళములు పట్టి
ఏకతారనుమీటి యెలుగునెత్తి
పాదతాళమువేసిపలునృత్తములుచూపి
చేతముద్రలుపట్టి చిందువేసి
ఆహార్య రచనతో హావభావములతో
పాత్రస్వరూపమ్ము పాదుకొలిపి

తే.గీ. మధురమంజుల వాగ్రస మండితమ్ము
నైన గంధర్వ గానాన నఖిలజనుల
మోదజలధిని తేలించి పుచ్చిరంత
లవకుశ కుమారకులయోధ్యరాజ్యమందు 49

కం. ఆనోట మరీనోటను
నానాటనుముని కుమారనాట్యపుగరిమన్
గానమ్మును గూర్చివినుచు
తానాస్వాదింప విభుడుదయతోపిలిచెన్ 50

సీ. మంత్రిసామంతులుమాన్యులుపురజనుల్
పండితపామర వర్గమలర
ఆలుబిడ్డలతోడ నాప్తవర్గముతోడ
తమ్ములు తనవారు తరలిరాగ
అక్కశాంతమతోడ నమ్మకౌసల్యతో
కైకేయియు సుమిత్ర కదలిరాగ
రాజమందిరముతోరాణివాసముతోడ
సేవకవర్గమ్ము చేరికొలువ

తే.గీ. స్వర్ణసింహాసనమ్మున చారుమకుట
రత్నభూషణాలంకృత రాజితుండు
రాఘవాంబుధి చంద్రుండు రాముడలరె
నవ్యకృతియైన రామాయణమ్ము వినగ 51

సీ. బంగారుజిలుగులో పొంగారు రత్నాలు
సవదరించిన వస్త్రచయము నిచ్చి
రత్నకాంతులతోడ రంజిల్లుస్వర్ణంపు
నగిషీలుచెక్కిన నగలనిచ్చి
మూడుపంటలుపండు భూఖండముల తోడ
రంజిల్లు నగ్రహారములనిచ్చి
అమరసౌఖ్యములొప్పు విమలసౌధము
లిచ్చి యాలమందలనిచ్చి యాదరించి

తే.గీ. భక్ష్యభోజ్యాలు చోష్యాలు వరుస నునిచి
మధుర మకరంద ఫలముల మగుడనిచ్చి
యెక్కుడగు కాన్కలను వారు తృప్తిపడగ
ఇనకులేశుండు రాముండు నిచ్చెనంత 52

కం. చిరునవ్వులు చిలికించుచు
ధరణీపతియొసగినట్టిధనధాన్యములన్
కరముల స్పృశియించుచు వే
పరమానందాన వారు ప్రణతులు సేయన్ 53

మ. గురుపాదమ్ములకంజలించి బహు వాగ్రూపేశ్వరిన్ శారదన్
వరవాక్యమ్ముల సంస్తుతించి నగజావాత్సల్యవర్ధిష్ణువున్
చిరుతన్ విఘ్ననిహన్యమాను దయకై సేవించి ఏతత్సభా
దర సమ్మోదమునంది పాడిరి కృతిన్ తాదాత్మ్యులై బాలకుల్. 54

మ. జనసామాన్యపు భాషలోన నెదుటన్ సంధిల్లు వృత్తాంతమున్
మనముల్ రంజిలునట్టి వర్ణనలతో మంజీరమంజుధ్వనిన్
వినిపింపంగ ముదమ్మునందని జనుల్ విశ్వాన లేరన్నచో
మునిపుంస్కోకిల కూజితమ్ము జగదామోదమ్మునన్ బొందదో! 55

తే.గీ. అట్లు రాజసభా భవనాంతరాళ
మందు లవకుశ సోదరు లాలపించు
ఇహపరమ్ముల సౌఖ్యమ్ము నిచ్చునట్టి
ఇనకులేశుని చరితమ్ము లెట్టివనిన 56

## రామకథా ప్రారంభము

మ. సరయూతీరము ధాన్యమండలము షట్చాస్త్రార్థ సంపన్నమున్
గురుధర్మావరణమ్ము సత్యమయ వాగ్బాఖండమున్ శాంతిగో
పురమున్ స్నేహవసుంధరావలయమున్ మోక్షాంగనాధామమున్
కరుణాగారము శౌర్యమండలము శ్రీకాకుత్థ్స సంస్థానమౌ 57

మ. ఫలపుష్పమ్ముల పట్టుకొమ్మ యపురూపమ్మైన జీవాళికిన్
నెలవౌ యద్భుత జాతిరత్నములకు న్సృష్టాంత మానందతుం
దిలమౌ జీవనయాత్రకున్ నిలయమై దీపించు నేతన్నదీ
జలపావిత్ర్య మహోన్నతంబు నిట సంశ్లాఘింప గాదేరికిన్ 58

మ. ఇనవంశ క్షితి పాలకుల్ ప్రభువులై సృష్ట్యాది పర్యంతమున్
జనతా కల్పక భూరుహమ్ము లగుచున్ సత్త్వాన పాలించుచో
ధనవంతమ్మయి, సౌఖ్యవంతమయి సద్ధర్మాత్మకమ్మైన స
ద్గుణవత్ కోసలరాజ్యమొప్పె సరయూ కూలంకషా తీరమున్. 59

మ. సువిశాలమ్ములు సుందరమ్ములు మహాశోభాయమానమ్ములౌ
నవధామమ్ములు రాజమందిరములున్ నానా ప్రజామార్గముల్
వివిధమ్మౌ తరుగుల్మచిత్రలతలున్ విఖ్యాతమై యొప్పు సం
స్తవ చారిత్ర అయోధ్య రాజపురమై శాసించె నారాజ్యమున్. 60

మ. కులధర్మమ్ములు కర్మధర్మములనే ఘోషించి సంఘమ్ము ను
జ్జ్వలవంతమ్మును జేసి జాతిగతికిన్ సౌఖ్యమ్ము జేకూర్చె ని
చ్చలు: నంగమ్ముల్ కర్మబద్ధమగుచున్ శారీరకారోగ్యమున్
పలురీతుల్ తెగబెంచి వర్ధిలునటుల్ భాగ్యోన్నతిన్ బొందుచున్. 61

సీ. ధర్మప్రబోధాన ధన్యతచేకూర్చు
విజ్ఞానఖనులైన విప్రవరులు
క్షాత్రధర్మముచేసి సంఘమ్ము రక్షించు
రణకళానిపుణులౌ రాజవరులు
అర్థతత్త్వమెరింగి యభివృద్ధినడిపించు
వ్యాపార దక్షులౌ వైశ్యవరులు
సంపద సృష్టించి సంఘమ్ము పోషించు
క్షోణి తత్త్వజ్ఞులౌ శూద్రవరులు

తే.గీ. ధర్మకర్మాచరణ జేసి ధరణిలోన
సకల సౌఖ్యంపు సంపదల్ జనులుపొంది
హెచ్చుతగ్గులులేనట్టి యెక్కుడైన
గౌరవమ్ములు రాజ్యాన గలిగిరంత. 62

ఉ. ఆకలి యూరలేదె యపహర్తలులేరె యసత్యవాక్కులా
యేకడనైన లేవె యపమృత్యుభయమ్ములు లేవె యాపురిన్
శోకములేదె సౌఖ్యమయ శోభిత జీవనయాన మొక్కటే
ఆకృతి యౌచుదోచు పురి న్యాయము దప్పని వర్తనమ్మునన్. 63

మ. సుకుమారత్వము సుందరత్వము మహా శోభాయమానమ్మునౌ
యకలంకత్వము నమ్మతత్త్వము తదేకాకారమై యొప్పి పా
వకతత్త్వమ్మును రంగరించుకొని స్త్రీ వర్గమ్ము రూపొందె స
త్వ కళాసృష్టికి పట్టుకొమ్మయగు నైక్ష్వాకు ప్రజాపాలనన్ 64

తే.గీ. ఆ అయోధ్యానగరమున కధిపుడగుచు
రఘుకులాంబుధి చంద్రుడు రమ్యశీలి
సర్వధర్ముడు దశరథ చక్రవర్తి.
జనులపాలించె రెండవ మనువువోలె. 65

మ. జనసంక్షేమము రాజ్యవిస్తరణ రాజ్య క్షేమనిర్వాహమున్
ధనసంరక్షణ ధర్మనిర్వహణ మంత్రత్వంపు చాతుర్యమున్
రణకౌశల్యము రమ్యవాక్పటిమతో రాజిల్లు సచ్ఛీలురౌ
ఎనమంద్రౌ వర మంత్రులొప్పిరి యయోధ్యేశప్రజాపాలనన్ 66

అ.వె. యుద్ధమందు జముని నోడింపగల్గిన
యోద్ధవరులు గలరయోధ్యలోన
యుద్ధకళలయందు నున్నతులౌవారు
శాంతి గోరువారు సత్యపరులు 67

మ. సరయూవాహినియే యగడ్త జనతాసంఘమ్మె సైన్యాళి యా
నరవాసమ్ములె యున్నతంపు బురుజుల్ నాగేటి దార్ఢ్యమ్ములౌ
కరయుగ్మమ్ములె యస్త్రశస్త్రతతి హృత్కంజమ్మె శ్రీరాజ శే
ఖర వాసమ్మయి యొప్ప నా పురము లోకస్తుత్యమై చెల్లుచున్. 68

సీ. నెలమూడు వానలు నివ్వటిల్లుటజేసి
పాడిపంటల వృద్ధి వరుసకలదు
పాడిపంటల వృద్ధి వరుసకల్గుటజేసి
పసిడిరాసుల పెల్లు వసుధ కలదు
పసిడి రాసులపెల్లు వసుధకల్గుటజేసి
సకలసౌఖ్య సమృద్ధిచాలకలదు
సకలసౌఖ్య సమృద్ధి చాలగల్గుటజేసి
యానందనిలయమై అవనికలదు

తే.గీ. కలదు కలదను మాటయే కలదుగాని
లేదు లేదను మాటెందు లేదు భువిని
ధర్మపాలనా కర్మిష్ఠి దశరథుండు
చక్రవర్తిగా రాజ్య శాసనము జేయ 69

తే.గీ. సకల సౌఖ్యానుభవములు సాగుచుండె
ఎద్దియో వెల్తి చిత్తాన నెగయుచుండ
ఎద్దియో లేమి లోన బాధించుచుండ
కన్ను చెమరింప రాజ్యమ్ము కనలుచుండె 70

## దశరథుడు చింతిల్లుట

సీ. సుకుమారసుందర సుమపరీమళగాత్రి
కౌసల్యసౌఖ్యమ్ము కాన్కనంది
శీతాంశు శీకరస్నిగ్ధ సంపద మేన
యాసుమిత్రసుఖము నాదరించి
యపురూపరూపయౌ యపరంజిబొమ్మయౌ
కైకేయి కౌగిలి కరమునంది
సకలభూపాలమస్తక కిరీట నవర
త్నచ్ఛటాదీప్త పాదాలతోడ

తే.గీ. అమరసౌఖ్యాల దేలుచు నధివసించు
దశరథునకొక్కటియ లోటు తారసిల్లె
పుత్రసంతాన భాగ్యమ్ము పొందడాయె
కొరతలేనట్టి సృష్టి యేధరణికలదు. 71

మ. ఒక సాయంతనవేళ ముద్దియలతో నుద్యాన మధ్యస్థ పు
ష్పక సోపాన విలాసమండపమునన్ సంభాషణా లాస్యుడై
మకుటమ్మున్ దలదీసి నేలనిడి తన్మాణిక్య రత్నచ్ఛవిన్
ప్రకటమ్మౌ పలు పండువెంట్రుకల నా రాజేంద్రుడీక్షించెడిన్ 72

తే.గీ. బిగువు సడలిన కండలు సొగసుతరిగి
పాలిపోయిన చెంపలు పట్టుసడలి
కదలుచున్నట్టి దంతాలు కంటిమసక
కలుగుముసలితనమ్మదిమొలుచునప్డు 73

తే.గీ. పలితకేశమ్ము వృద్ధాప్యపాదముద్ర
మరుని యశ్వంపుపుచ్ఛమ్ముమరణరేఖ
ముందు తలకట్టు పరలోక మోక్షమార్గ
కారకమ్మును స్వర్గంపు కడిమి మజిలి. 74

తే.గీ. పలితకేశమ్ములట్టుల బట్టిచూసి
స్తబ్ధుడయ్యెను దశరథ చక్రవర్తి
సరససంభాషణాలాస్యవిరసుడగుచు
చిన్నిమొగమున స్వగృహము చేరెనంత 75

ఉ. మానవజీవితమ్ము క్షణమాత్రము నిల్చెడి బుద్బుదమ్మయే
కోణము నుండి చూచిన నకుంఠిత యౌవన మంతమాత్రమే
దాన కులమ్ము నిల్పవలె దాన పితౄణము తీర్పగావలెన్
దాన ధనమ్ము పొందవలె దాన యశమ్మును పొందగావలెన్ 76

ఉ. భోగ విలాస లాలస యపూర్వకళాకృతి కాకృతినందజేసె నా
రాగమనోంబుజంబున సరంజకమౌచు సమస్తభోగముల్
యోగములయ్యెగాని హృదయోత్సవ కారకమైన పుత్రసద్
భోగమునందనైతి పరిపూర్ణుడ నెట్టులనౌదు చూడగన్. 77

ఉ. జీవికి మూలమైన స్మరచింత చిరంత ఫలమ్ము సూనులా
జీవఫలమ్ములం గలుగు జీవి ధరన్ పరిపూర్ణుడౌను త
జ్జీవి కులమ్మునిల్చు నట జీవి పితౄణముతీరు నట్టిదౌ
జీవనభాగ్యమీ యధమజీవికి లేదని రాజు క్రుంగెడిన్ 78

మ. ఫలపుష్పమ్ములు లేనియట్టి వనముల్, బంగారు వర్ణమ్ముతో
బలువౌ సైకతవాహినుల్, నెఱియలై భాసిల్లు కేదారముల్,
తలపుంబారెడి పుత్రహీనమగు నా ధర్మార్థభాగమ్ములౌ
తలిరుంబోడుల దల్చికొన్న పతికిన్ దైన్యంపు సం పాతికిన్. 79

కం. చింతా క్రాంతుడునై భూ
కాంతుడు రాజ్యాదిధర్మకార్యక్రమ వి
భ్రాంతికి లోనగుటగని సు
మంతాది సుమంత్రులంత మాన్యుని గనుచున్. 80

ఉ. చింత యదేటికయ్య తమచిత్త మదెట్టుల నొప్పు నట్టులే
అంతయు సాగుగాక హృదయాంతర శల్యము డుల్చివైచి య
త్యంత శుభమ్ముగూర్చు సుఖదంపు టుపాయము ధర్మబద్ధమున్
వంత తొరంగుదాని తగబల్కిరి బ్రహ్మలు శాస్త్రద్రష్టలై. 81

ఆ.వె. వారు పల్కునటు లుపాయమ్ము గావింప
బలము గలుగు చింత తొలగిపోవు
సకలరాజ్యరమకు జయ పరంపరగల్గు
తథ్యమనుచు మంత్రితతి వచింప 82

తే.గీ. సకల నైగూఢయాజ్ఞిక చక్రవర్తి
వేదవేదాంగ చణుడునౌ విప్రవరుడు
రాజవంశ పురోహిత వ్రాతవిభుడు
నౌ వసిష్ఠ మహర్షి తా ననియె నిట్లు. 83

మ. అనఘా!చింత యదేటికయ్య తమదౌ యాస్వాంతమీడేర్చు పా
వనమౌ జన్నమొకండుకద్దు శ్రుతిలో భాస్వద్భుజా వీర్యులౌ
ఘనులీ యజ్ఞము జేయనేర్పరులు లోకమ్మందు సద్వీర్య స
ద్గుణ సత్కీర్తి కర ప్రసూను లుదయింతుర్ పుత్ర కామేష్టిచేన్. 84

కం. వల్లెయని మీరుపల్కిన
ఎల్లన్ సమకూర్చుకొందు మిష్టికి జగతీ
వల్లభ! ముదమున రాజ్యము
త్రుళ్ళగ వంగడము పొంగ లోకము మెచ్చన్ 85

చం. అనవిని రాజుగద్దెదిగి యంజలిబట్టి వశిష్ఠుతోడుతన్
మునిజన మాన్య!మీ ముదల మూదల దాల్చెదు నేడె దీక్ష గై
కొనియెదు దానికై సకల గోధన భూధన కాంచనాదులీ
యనలసమానులైన వసుధామర పాళికి నిత్తు దక్షణల్ 86

మ. వినుడో మంత్రివరేణ్యులార యిది వైవిధ్యంపు జన్నమ్ము దీ
నిని శ్రద్ధాభయభక్తులన్ జరుపుచో నిర్విఘ్నమై కామితం
బొనగూరున్ దగుచర్యలన్గొనుడు యజ్ఞోపాంత తీరమ్ములన్
జన సందోహము నిల్వగా వసతులన్ సంసిద్ధమున్ జేయుడీ. 87

మ. హితులన్ వృద్ధుల మిత్రులన్ బిలువుడీ యీపుత్ర కామేష్టి సం
గతులన్ జూడగ బంధువర్గముల వే గ్రామానకున్ చేర్చుడీ
అతిశీఘ్రమ్ముగ రత్నదీపములతో హారాలతో పూలతో
మతి దుర్భేద్యనయోధ్య చిత్రగతులన్ మన్నించి భూషింపుడీ 88

మ. జనసామాన్యులు మాన్యులౌ పురపతుల్ సర్వంసహా పాలకుల్
మన యాహ్వానము చేసి రాగల రసామాన్యంపుటేర్పాటులన్
మనముల్ గెల్వుడు వారు తృప్తిపడుచో మాడెందమీడేరు నీ
మనయౌన్నత్యము దెల్పురీతి ఘనమౌ మర్యాదలన్ జేయుడీ. 89

తే.గీ. అనివలయుకృత్యములనెల్ల నానతిచ్చి
సకలమంత్రి పురోహిత సమితినెల్ల
వీడ్కొలుపుచు నంతిపురంబు వేగ జేర
సాగెనంతట దశరథ చక్రవర్తి. 90

మ. అతి సంతోషముతోడ వెల్గు మొగమై యావచ్చు ప్రాణేశు సం
గతి వీక్షించి మనంబుపొంగ నెదురై కల్యాణ కైంకర్యలై
సతులాహ్వానము బల్కుచో విభుడు హాసస్ఫోరకాలాపమున్
సతులన్ కౌగిట బట్టి యాసనముపై సంధిల్లె హేలాగతిన్. 91

సీ. కౌసల్యదేవేరి కామితమీడేరె
నిన్నినాళ్ళ తపమ్ములిపుడు పండె
కైకేయి దేవిరో కాంక్ష ఫలించె నీ
వ్రతములు నోములు ఫలమునిచ్చె
ఓసుమిత్రాదేవి యూరడిల్లెను చిత్త
మీ చేయు పూజ ఫలించెనిపుడు
భాగ్యదేవతలార భార్యలార వినుడు
వంశాంకురము మొల్చు పథముదొరికె

తే.గీ. శ్రుతి విహితమైన జన్నంపుకతన పుత్ర
భాగ్యమబ్బును మనలకు వ్రతసుదీక్ష
గైకొనుడు సర్వమంగళ కరుణజేసి
చిత్తమీడేరుననుచు క్ష్మాజేత పలికె. 92

కం. శుభమని చిలుకలు పలికెను
శుభమని రాయంచపిండు సొగసుగ పలికెన్
శుభమని క్రోల్చెను నెమళులు
శుభమని పుంస్కోకిలములు సొబగుగ పాడెన్ 93

కం. శుభతిథి శుభనక్షత్రము
శుభయోగము శుభకరణము శుభవారంబున్
శుభలగ్నపు శుభగడియల
శుభయాజ్ఞిక దీక్షగొనిరి సుదతులు దానున్ 94

## ఋష్యశృంగుని కథ

మ. అనఘా! మీరలు వేగజేయదగు కార్యం బొండు సంధిల్లె దా
నిని వేరెవ్వరు చేయగా దగరు మీ నేతృత్వమే కార్యసి
ద్ధిని చేకూర్చి ఫలమ్ములిచ్చుననుచున్ ధీమంతుడౌమంత్రి మం
త్రణమున్ జేయ సుమంతువాక్యములకున్ రాజేంద్రుడూకొట్టగన్ 95

కం. మును మునిజన మాన్యులచే
వినినది వినిపింతునార్య! విఖ్యాతంబౌ
మనయిష్టికిని విభాండక
తనయునిఋత్విజునిచేయదక్కును ఫలముల్. 96

ఉ. వారలు బ్రహ్మవిత్తములు వారలు వేదవిశేషపారగుల్
వారలు వశ్యవాక్కులు శుభంకరు లిష్టి విశిష్టులిష్టులున్
వారల స్పర్శచేసి తనుపారెను తొల్లిట యంగరాజ్యమున్
వారల వాక్కుచేసి తనుపారును నేడె యయోధ్య దేశమున్ 97

ఆ.వె. అంగరాజ్యలక్ష్మి హస్తకమలమును
చిత్రరధుడు కొనుచు క్షితితలమున
కర్మయోగి యంచు ధర్మవీరుడటంచు
పాలనమ్ము చేసి పడసెఁ గీర్తి. 98

ఉ. వానిని రోమపాదుడని వాకొను చుందురు లోకులెల్ల న
వ్వాని పరాక్రమమ్ము మరివాని ప్రజా పరిపాలనమ్ము ల
వ్వాని రసజ్ఞతాగరిమ వాని వచోవిభవమ్ము స్తుత్యమై
వానిని రాచమిత్రునిగ, పార్థివ లోకము గారవించెడిన్ 99

ఉ. అట్టి సమర్థుడైన పతి యంగధరా స్థలి నేలుచుండ పెన్
గిట్టల మట్టుచున్ బ్రతుకు క్రిందులు సేయుచు కోరపండ్ల పెన్
ముట్టెలబట్టి కుమ్ముచు నమూర్త మహాఘన దీర్ఘకాయమై
రట్టడి సేయుచున్ గరువు రక్కసి వచ్చె సితాభ్రపాళికన్. 100

మ. ఉదయమ్మాదిగ దీర్ఘతీక్ష్ణకరుడై యుగ్రస్వరూపమ్మునన్
చదలన్ సాగెడు భాస్కరుండనిశమున్ శైత్యమ్ము కోల్పోయి కాం
తిదమౌ దర్పణమట్లునొప్పు శశి ధాత్రీగోళసంచారులౌ
పదునౌ గాలులు వేడిగాడ్పులగుచున్ భాసిల్లె నవ్వేళలన్ 101

మ. జలదమ్ముల్ గతి దప్పిపోయె, మఘవున్చాపంపు వర్ణంబులా
కళతప్పెన్, బెడిదంపు మేఘలతికా కాంతిచ్ఛటల్ వాడి ప్ర
క్కలయెన్, భీకర మేఘగర్జలుడిగెన్, కన్పండువుల్ సేయు వ
న్నెల కాంతారమయూర నాట్యములు లేనేలేవు గ్రీష్మమ్మునన్. 102

మ. పటియల్ వారెను నేల, సస్యములు పూపల్ మొగ్గలున్ బూలతో
కొరగాకుండగ మాడిపోయె, శిఖరుల్ గుండ్రాళ్ళునై బాసిలెన్,
చెఱువుల్ పంకపుదిబ్బలాయె, తరువుల్ శీర్ణంబులై స్రుక్కె, భూ
చరముల్ మృత్యుముఖమ్మునన్బొరలి వేసారెన్ మహాక్షామమున్. 103

శా. పాతాళమ్మున దాగె నీటివనరుల్ వాతస్థ శైత్యమ్ములా
శీతాద్రిన్ వెసజేరె గ్రాసమరయన్ శేషించె నెచ్చోటులన్
భూతమ్ముల్ విలసిల్లె ప్రేతకళతో భూఖండమట్టుడ్కుచో
భీతిన్జెంది జనమ్ములెల్ల వలసల్ వేపోయిరామొత్తమున్ 104

సీ. వరుణయాగమ్ములు వరుసచేయించిరి
వీధి వీధి యనక వీడులోన
పూర్వచారిత్రక పుణ్యకథాతతుల్
పరమపౌరాణికుల్ పలికినారు
గ్రహదోష పూజలు గ్రహయోగజపముల
నాలయమ్ముల జేసియలసినారు
కప్పలపెండ్లిండ్లు ఘనముగ జేసిరి
పెన్జెర్వు గట్లపై విసుపులేక

తే.గీ. శాస్త్రవచనానుసారమ్ము సలిపియున్న
చరిత చెప్పినయట్టుల సలిపియున్న
జానపదులు వాకొనునట్లు సలిపియున్న
కనగ భూమిపై రక్కున చినుకులేదు. 105

తే.గీ. మూడు వర్షాలు వర్షాలజాడలేక
అటులరాజ్యంబు క్షోభిల్ల నవనిపతియు
వేదశాస్త్ర పురాణ ప్రవీణులకడ
కఱవు తరలునుపాయము గఱపుడనగ 106

ఉ. ఒక్క యుపాయమున్ గలదె యొక్కడ యట్టి విపత్తుబాపు నా
యొక్క డసాధ్యుడై వరలు నొప్పవె యిట్టివి సాహసమ్ములే
యొక్కని కైనగాని మనుజోత్తమ కాలము మారుదాక నీ
యిక్కటు లెట్టులైనను భరింపుమటంచును వారుతెల్పుచోన్. 107

తే.గీ. ఇంతకన్న విపత్తులింకేమి కలుగు
ఇంతకన్నను సాహసమేమి కలదు
మాన్యులార సందియమెల్లమాని తెల్పు
డయ్యమార్గమనుచుపల్కెనవనిపతియు 108

సీ. అపర విశ్వామిత్రుడనగ వాకొనవచ్చు
కఠిన తపోదీక్ష కారణమున
ఏకాక్షి శుక్రుండె యివ్వాని ప్రతిజోదు
మంత్రాంగచాతుర్య మహిమకతన
దుర్భరకోపాన దుర్వాసమౌనీంద్రు
తాతయంచివ్వాని తలపవచ్చు
రాచవర్గంబన్న నీచభావనచేసి
భార్గవు భ్రాతగా పలకవచ్చు

తే.గీ. అట్టిదౌ విభాండక మౌని నధిగమింప
అంగరాజ్యంపు పెన్నిధి యఖిలశుభుడు
పరమపురుషుండు విజ్ఞాని బ్రహ్మచారి
ఋష్యశృంగుడు నొప్పారు శృంగమూర్తి. 109

ఆ.వె. తండ్రిచాటు బిడ్డ తరలివచ్చినయేని
కరువు కరగిపోవు కలుగు శుభము
హర్షకారకమ్ము వర్షమ్ము తోడుతన్
విశ్వమెల్ల వే సుభిక్షమగును 110

మ. అని అమ్మాన్యులుతెల్ప భూవిభుడు తానత్యంత విశ్వాసులన్
ఘనులన్ మంత్రివరేణ్యులన్ పిలిచి తత్కార్యంపు సాఫల్యమున్
గన మంత్రాంగము జేసి యాజ్ఞలిడియెన్ కాంతార సంక్లిష్టునిన్
ఘను వైభాండకు ఋష్యశృంగు జనసంఘావాసునిన్ జేయగన్. 111

మ. వనజాక్షుల్ నవజాతపద్మముఖులున్ స్వర్ణప్రభా దేహలున్
ఘనశృంగార విలాసహాస చతురల్ గాంధర్వవిద్యోన్నతుల్
జనమాన్యల్ వినయాది సద్గుణవతుల్ సౌందర్య సంభార జీ
వన చారిత్రలు సిద్ధమైరి గణికల్ భారమ్ము కైబూనుచున్ 112

తే.గీ. శివుని పూజకు సిద్ధమ్ము చేయబడిన
మంచుతడిసిన నరవిచ్చు మల్లెలట్లు
మునికుమారుని తో తెచ్చు ముదితలెల్ల
పయనమైరి తపోవనవాటి చేర 113

ఉ. పుట్టినదాది స్త్రీముఖము ముచ్చట కైనను జూడబోడు చూ
పట్టెడి దట్టమౌ యడవిపట్టున విద్య తపమ్ములొక్కటే
పట్టును ,దండ్రియే సఖుడు భ్రాతయు నొజ్జయు సర్వమాతడే
అట్టిడు ఋష్యశృంగునకటా జలజాక్షులు తెచ్చుటెట్టులో 114

ఉ. గండశిలామయమ్ము పటుకంటక గుల్మలతామయమ్మునౌ
కొండలుకోనలన్గడిచి కోకిల షట్పద కీరగీతికా
మండితమున్ వసంత ఋతు మార్దవ పుష్ప సుశోభితమ్ము నౌ
చండతరాటవిం గనిరి శాద్వల శీతల సౌఖ్యపూర్ణమున్. 115

సీ. రామచిల్కలదండు రాజహంసలపిండు
లిల తోరణమ్మొచు నెగురుచుండ
తరుగుల్మలతలతోనురుసరస్సులుగూడి
విరిరంగవల్లులై పరిమళింప
లేగదూడలతోడ లేడికూనలు గూడి
వింత యరుపులతో విందుచేయ
సెలయేటిగలగలల్చిరుగాలిమొరమొరల్
మంద్రగానమ్మొచు మరులుగొలుప

తే.గీ. సుమపరిమళము హృదయమ్ము చూరగొనగ
భ్రమణ మొనరించు నెలదేటి పంక్తు లొకట
నవ్యరీతుల పురివిప్పి నాట్య మాడు
వనమయూరమ్ములవరుస బరగియుండె 116

మ. ఇది సామాన్యపు కోనగాదు కనుచో నేదివ్య మౌనీంద్రుడో
ఉదయంబందిన నేలయౌ కనుకనే యుత్ఫుల్లసౌభాగ్య సౌ
ఖ్యదమై నొప్పెడి నంచు కాంతలన నీ కాంతారమే వాసమౌ
సదయుండౌ ఘన ఋష్యశృంగ మునికిన్ క్షామార్తి నిశ్శేషికిన్ 117

మ. అని సేనాపతి పల్కి స్త్రీసముదయం బారణ్య మధ్యస్థమున్
పని సాధింపగ పూర్ణమై వరల సంభారమ్ములన్ గూర్చి చ
క్కని పూదోటలమాటు సౌఖ్యమయమౌ గాఢంపు చప్రమ్ము వే
సిన విశ్రాంతిని నాడుగైకొనిరి రాజీవాక్షులప్పాటునన్. 118

కం. మౌనివరు నాశ్రమంబును
మౌనీంద్రుతపఃసమయము మాధవు సేవన్
దైనందిన మునిచర్యలు
సానుగుణమ్ముగ తెలిపిరి చారులు వరుసన్. 119

సీ. రెండు జడలనల్లి నిండపూలుముడిచి
పరికిణీవోణీల బరుగునొకతె
మైపూతలం దిద్ది మరకతమాణిక్య
రత్నాల నగలతో గ్రాలునొకతె
చిత్రవిచిత్రంపు చిత్రాంబరమ్ముల
చిత్రమ్ముగా కట్టు చేడెయొకతె
కోరచూపులతోడ కులుకుచు నడచుచు
మందస్మితమ్ముల మగువయొకతె

తే.గీ. సానపట్టిన మదనుని శస్త్రమటుల
సోయగమ్ముల రాజిల్లు సుదతి యొకతె
సీతకోక చిల్కలదండు చెలగినటుల
ఋష్యశృంగుని ముని వాటి కేగినారు 120

తే.గీ. నిత్యనైమిత్తికమ్ములు నెరపుకొరకు
శివుని గూర్చిన తపములజేయుకొరకు
ఆ విభాండక మౌని తానరిగె గంగ
వాటికకు సూర్యుడుదయాద్రి బరగువేళ 121

కం. అడుగులు తడబడ నడచుచు
దడదడమని యెడదవణికి దడపులు పొడమన్
పొడగని గడబిడ పడుచును
కదు గడుసరి గణికలపుడు కడువడి వెడలన్ 122

మ. తలపై శృంగము కావిరంగు వలువల్ ధర్మప్రకాశంబులౌ
కలువల్ బోలినకండ్లు చిన్నపెదవుల్ గంభీర కాయమ్ము శ్యా
మలమౌ శ్మశ్రువులొప్పు నవ్యయువకున్ మాంగల్య తేజోనిభున్
బలునిన్ మౌనిని ఋష్యశృంగు గనిరా భామామణుల్ ముచ్చటన్ 123

మ. తలపై దాల్చిన యట్టి మేలిముసుగుల్ తా జార మైవంచి కో
మల హస్తమ్ములు మోడ్చి నవ్వుమొగమున్ మందార కుందాది మా
లలతో మోదకమాది భక్ష్యములతో రత్నాంబరాలంకృతుల్
విలువౌ కాన్కలతోడ కాంతలతనిన్ వేంచేయ ప్రార్థించుచోన్ 124

ఉ. ఎవ్వరు మీర? లిచ్చటకు నేపని పైబడి వచ్చినార? లీ
పువ్వులదండ లేమిటికి? ముద్దల పోలికనున్నవేమి? యే
దవ్వులనుండి వచ్చితిరి? దక్కు ఫలమ్ములు మంగళమ్ము లీ
గవ్వల తిన్నె గూర్చొనుడు గ్రన్నన బాయుడు క్లేశభారమున్. 125

ఆ.వె. అయ్యయొప్పుడయ్య నెయ్యమ్ము కైనేని
మీరలిచ్చుకాన్క మేముగొనగ
మరల గొనుడు వీని మాదు నెయ్యము దల్చి
వేరు తలపవలదు విధము తెలిసి. 126

మ. అని వైభాండకుడాడ లేతనగవుల్ వ్యాపింప నెమ్మోమునన్
క్షణమాత్రమ్మున నేత్రముల్ ముడిచి రాకాపూర్ణ చంద్రాస్యలౌ
గణికల్ గవ్వలతిన్నె కూర్చొనిరి లో కందిల్లు డెందమ్మునన్
మునివ్రేళ్ళన్ నిలుచుండి యొక్కయమ సమ్మోహమ్ముగా పల్కెడిన్. 127

ఉ. వందనమోయి మౌనివర! భాగ్యవిధాత! విభాసమాన! మే
మందరమున్ మనోజముని మాన్యుని శిష్యులమోయి, యద్దెసన్
సుందర పుష్పవాటికల చొక్కెడి నాశ్రమవాటి మాది కన్
విందగు నివ్విపండ్లు, కడు వింతలు గల్గెడు మాదుదేశమున్ 128

ఉ. మీదగు దర్శనమ్మున శమించెను పాపములన్ని భూసురా
మాదగు విన్నపమ్ము వినుమా! యపురూపఫలమ్ములివ్వి స
మ్మోదముచూపి మమ్ముల ప్రమోదము చేయు డటంచు చాన యా
మోదకమున్ విలాసగతి ముక్కలు సేసి నొసంగె మౌనికిన్ 129

ఉ. తుంచిన ముక్కనోటనిడి తొయ్యలి వామకరమ్ము పట్టి నీ
పంచిన పండుకిట్టి రుచి వచ్చుట యెట్టులొ? తెల్పు మిత్రమా
మంచి ఫలమ్ముదెచ్చితివి మామది దోచితి వంచు జేడియన్
పంచన చేర్చికొంచు నభివాదము చేసెను మౌనిసూనుడున్ 130

ఉ. ముద్దియలంత మౌనిసుతు ముంగిట చేరి కరమ్ములాన్చుచున్
పెద్దయపొద్దు ముచ్చటల వేడుక చూపిరి వారిమాటలన్
విద్దెలసుద్దులున్ వివిధ వేద విభాగ విశేషగాథలున్
పద్దెపు సోయగమ్ములు, ప్రపంచపు వింతలు దొర్లసాగెడిన్ 131

సీ. తన కావిబట్టల తగజూచి చేడెల
చిత్రవర్ణాంబర శ్రేణిజూచు
తన గెడ్డమును చెంప దడిమికొను ముదిత
వదనమ్ము చెక్కిలి పట్టిచూచు

తన తలపై కొమ్ము తలచికొను సుదతి
తలసోయగమ్ములు నిలిచి చూచు
తనమోటుచేతుల గనుజూచి పూబోడి
కరసౌకుమార్యమ్ము కనుల నిలుపు

తే.గీ. తనదు దేహదార్ఢ్యమ్మునా తన్విమేను
కులుకు, సుందర సుకుమార గుణము చూచు
స్త్రీపురుష భేదభావమ్ము తెలియనట్టి
ఋష్యశృంగమునికుమారు డిష్టుడగుచు 132

మ. భళిరా మిత్రమ బాగుబాగు ఫల సంభారమ్ము లాప్యాయతల్
కలయో సత్యమొ మీదురాక తెలియంగా నైతి మీదేశ వా
సుల యాచారములున్నతమ్ములు సుమీ, సూర్యుండు తో తెంచగా
మలిసారిచ్చుట కేగుదెంచుడనుచున్ మాన్యుండు వాక్రుచ్చెడిన్ 133

ఆ.వె. పడమటదెసజారుభానుబింబముజూచి
జలజ నేత్రలంత కలతచెంది
మూటముల్లెసద్ది మునియాశ్రమమువీడి
బయటపడిరి వారు బయలుదేర 134

మ. ఇనుడస్త్రాద్రిని జేరకున్న గగనమ్మెర్రగా మారకు
న్నను సంచారులు పక్షులింటి మొగ మైనన్ బెట్టిరాకున్న నా
గణికల్ మౌనికుమారువీడిచన నంగల్ సాచుటేలన్నచో
అనలుండైన విభాండకున్ భయము నల్లాడించు నవ్వారలన్ 135

ఆ.వె. మౌని లేనియపుడు మౌనిసూనుకొరకు
ముదితలెల్ల వచ్చిపోవువారు
పరిచయాలుపెంచి పరువమ్ము పసజూపి
పూనుకొనిన పనిని పూర్తిచేయ 136

సీ. కలువకన్నుల వాడికడగంటి చూపులు
తాకుచో డెందమ్ము దడ పెరుంగు
చిగురుబోడులలేత చిరునవ్వు వెన్నెలల్
పర్వుచో హృదయమ్ము పరవశించు
చారుకేశినులదౌ సంభాషణమ్ములు
చెవిశోక చిత్తమ్ము చిందులేయు
వెలదుల మురిపెంపు వ్రేలితాకులచేసి
ముకుళించు నెమ్మేను పులకరించు

తే.గీ. యౌవనారంభకాలమ్ము లగుటచేసి
క్రొత్తసుఖములు దేహమ్ము కోరుచుండ
వారిజాక్షుల స్నేహమ్ము వలదునాక
ఋష్యశృంగుడు ముప్పొద్దు తృప్తిబడసె 137

ఆ.వె. జీవసహజమైన చిత్తవికారముల్
బీజమటులలోన వెలుగుచుండ
అదునుపదును జూచి యల్లును హృత్సీమ
ఎట్టి వారి కైన సృష్టి లోన 138

శా ఎన్నాళ్ళిట్టుల పంజరంపు శుకమై యేకాకివై నుండెదో
నిన్నున్ గోరుచు నీదు పాదరజమున్ నిక్కమ్ము మైసోకగా
కన్నుల్ గాయలు కాయ మాధరణి నీకై వేచి వీక్షించె నో
యన్నా! రండటు పోయివచ్చెదము సాయంసంధ్యరాకుండగన్ 139

శా. వచ్చీపోయిన నిల్చుచుట్టరికముల్ బంధుత్వముల్ స్నేహముల్
నిచ్చల్ మేమిట కేగుదెంచుటయె గానీ యొక్క సారైన మా
సచ్చారిత్రపుసీమ చూచుకొరకై సాగింతురాయాత్ర?మీ
స్వేచ్ఛన్ గాదను వారమా? మునివరా చింతించి తీర్పంగదే. 140

మ. ఇనుడస్త్రాద్రిని చేరకున్నమునుపే యిల్ వీడు నీతండ్రి యీ
మునివాటిన్ పొలిమేర చేరుమునుపే మున్నున్నదున్నట్లుగా
మునివాటిన్ వసియింతువయ్య యట మా పుణ్యాశ్రమశ్రేణి పా
వనమౌ పాదరజంబుచే దనిపి మా భాగ్యంబు పండింపుమా 141

కం. అనిగణికలు పలువిధముల
మునిసూనుని స్వాగతింప ముసిముసి నగవుల్
నునుపెదవుల మొలకెత్తగ
మునికొమరుడు వల్లె యనెను మోదము తోడన్ 142

కం. కనుమూసి తెరచు లోపల
ముని వాటిని వీడి యంగ భూ మార్గములన్
మునిసూను తోడుకొంచును
చనిరా గణికలు రథాన సంగడి నెపమున్ 143

ఆ.వె. వేదవాదులైన విప్రుల తోడుత
తరుణ కపిల గోశతమ్ము తోడ
అఖిలజనులతోడ నంగభూ విభుడంత
స్వాగతించె మునిని సాదరమున 144

ఆ.వె. అంగరాజ్యమందు శృంగమౌనీంద్రుడు
కాలుపెట్టె నంత కరిగెకరువు
జలదగర్జనమున శక్రచాపమ్మున
పులకరించె భూమి తొలకరించె. 145

చం. దినకరుడస్తమించె నలుదిక్కుల చీకటు లొత్తిగిల్లె గో
ధనములు శాలచేరె గురుదైవ తపమ్ముల జేసి సోలి బ్రా
హ్మణుడు విభాండకుండు ముని మాన్యుడు నాశ్రమవాటిచేరి సూ
నునకయి చీరె డెందమున నూల్కొను ప్రేముడి తీగసాగగన్. 146

కం. తనమాట తనకు వినబడ
తనయునికై తల్లడిల్లి తాలిమితోడన్
తనయాన్వేషణచేసెను
మునిహితుడు విభాండకుండు మునిపల్లెలలోన్. 147

మ. తనయుం గానకతల్లడిల్లి కనులన్ దైన్యంబు క్రమ్మంగ పూ
డిన డగ్గుత్తికతోడ సూనుకొరకై డెందమ్ము కంపింప త
న్మునివాటిన్ కనిపించువారినడిగెన్ పోరాని యెచ్చోట కై
నను వేపోయి బిరానజొచ్చి వెతికెన్ నామోషి పైద్రోచుచున్ 148

ఆ.వె. వెతికి వెతికి వెతికి వేసారి యమ్మౌని
ఆశ్రమమ్ము చేరి యలుపుతీరి
దివ్యదృష్టి నంత తేటతెల్లముగాగ
మొగము జేవురింప ముందుకురికె 149

ఆ.వె. లేగదూడ దలచి వేగచన్నులు చేప
మొగమువంచి యురుకు మొదవు వోలె
అంగభూమివరలునాత్మజుకొరకునై
పరుగుతీసె నా విభాండకుండు 150

మ. మునిరాకన్ గమనించి యంగపతి సమ్మోహంపుటాహ్వానమున్
మునిమాన్యున్ వెస స్వాగతించి సచివుల్ ముఖ్యుల్ చమూనాథులున్
తన వెన్నంటగ రాజ్యపీఠమున భద్రాలంకృతున్జేసి యీ
ఘనరాజ్యంబును రక్షసేయుమనఘా! కారుణ్యనేత్రుండవై 151

ఉ. భృత్యుడనయ్య నేను వసుధేశ్వరు లెల్లరు వశ్యులయ్య మా
కృత్యములెల్ల దేశసుఖ వృష్టిని కోరుట జేసి, మీదు సాం
గత్యముచే ఫలించెనవి, కావున దోషిని నేను శిక్షకై
సత్యము వేచియుంటి నని సత్త్వుడు భూపతి దోయిలించెడిన్. 152

తే.గీ. అంగరాజ్యాన దుర్భిక్ష మలముకొనుట
దానచేసిన యజ్ఞాది ధార్మికములు
మౌనిసుతు రాకచేత క్షామమ్ము తొలగి
తొలకరించుట సచివులుతెలిపిరంత. 153

చం. జనహితకారివై మెలిగి సజ్జనుడైతివి స్వార్థబుద్ధి యే
కణమున లేదయైన వనగర్భమునందు వసించు మౌని సూ
నుని నిజరూపదీపిత వినోదిని సంతత సత్యవాదినిన్
ఘను గొనివచ్చినావిటకు కర్మ ఫలమ్ము తొలంగ సాధ్యమే? 154

తే.గీ. మోక్ష సామ్రాజ్య పదవిని బొందవలయు
నట్టి యీతండు నిట్లయ్యె నధిప, గాన
సకల సామ్రాజ్య సిద్ధియ జరుగ వలయు
నని విభాండక మౌని తా నానతీయ 155

ఉ. ధన్యుడనైతి నయ్య మునిధార్మిక! మీదగు నాజ్ఞచేసి యం
చన్యము దల్పకున్న తనయన్ సుకుమారిని సుందరాంగి సా
ధ్గుణ్యను దండ్రిమాట తలగూర్చెడి దానిని శాంతనామికన్
మాన్యునకిచ్చి భూమిపతి మాన్యులు మెచ్చగ పెండ్లిచేసెడిన్. 156

తే.గీ. అంగరాజ్యాభిషేకమ్ము నందినట్టి
ఋష్యశృంగుడు తపముకై యేగువేళ
తనకు మారుగ మామను ధరణినిలిపె
ఆ విభాండకుడంత నాహ్లాదమంద. 157

తే.గీ. అట్టిఋష్యశృంగమహర్షి యాగమునకు
ఋత్విజుండయి నడుపంగ నిష్టిఫలము
తృప్తినిడుగాన పిలువుడీ దివ్యమునిని
అని వశిష్ఠుడు తెలిపెనా యవనిపతికి 158

## షష్ఠ్యంతాలు.

బృందావన సంచారికి,
ఇందీవర నీలరుచికి, నిభవరదునకున్
స్యందన చోదకునకు,యదు
సుందరునకు వేణుగాన శోభిత ధృతికిన్ 1

చల్లల నమ్ము గొల్లెతల సంగడికానికి వెన్నదొంగకున్
నల్లని పోతుటీగకు ధనమ్ముల బోటిని దాల్చువానికిన్
పిల్లన గ్రోవి గానమున విశ్వము మూర్ఛల జేయువానికిన్
ఫుల్లసరోజ నేత్రునకు మోహనమూర్తికి చక్రధారికిన్. 2

అన్నియు తానగువానికి
నెన్నడు తగులాటమేమి నెరుగని పతికిన్
వెన్నెలనవ్వులవానికి
పన్నగశాయికి పశుపరిపాలన మతికిన్ 3

ఇది శ్రీకౌండిన్యస గోత్ర సంభవుడు
ఉపాధ్యాయుల వంశరాకాసుధాకరుడు
సూర్యకాంత నారాయణమూర్తి దంపతుల
అష్టమగర్భుండు పరమేశ్వర పదభక్తుండు
మధురకవి బిరుదాంకితుండు అగు గౌరీశంకరునిచే రచింపబడిన
శ్రీరామకథామకరందము
బాలకాండమునందు ప్రథమాశ్వాసము
సర్వము సంపూర్ణము.

**–శుభమ్–**

# శ్రీరామ కథామకరందము

## *బాలకాండము*

## ద్వితీయాశ్వాసము

శ్రీరమణీ హృదయ విహా
రా! రావణ దనుజహార! రాఘవ వీరా!
కారుణ్యాకర! బంధిత
పారావారా!శ్రుతినుత వాక్యవిహారా!

### దశరథుడు పుత్రకామేష్టి యొనర్చుట

ఆ.వె. మంత్రయుక్తముగను మానినులన్గూడి
యజ్ఞదీక్షనందె యవని భర్త
ఋత్విగాళితోడ నిక్ష్వాకు రాజ్యంబు
సంతసానఁ బొంగె సంద్ర మటుల 1

ఉ. ఉత్తమజాతి యశ్వము మహోన్నత రీతి నలంకరించి పూ
గుత్తుల దండవేసి ఎదకోర్కెలు నిండగ పూజచేసి పెన్
కత్తులు పట్టి యోధ తతి కావలి కాయగ ఫాలభాగమున్
పుత్తడి పట్టమున్ నిలిపి భూమిని చుట్టగ వీడిరశ్వమున్ 2

తే.గీ. అశ్వమేధమ్ముచేయంగ నవనిపతియు
నవనిచుట్టంగ వీడిన అశ్వమిద్ది
యనుచు పూజలు చేసిరి అవనిజనులు
తురగ రాజమ్ము పయనించు ధరణియంత 3

తే.గీ. యజ్ఞకంకణ బద్ధుడౌ యవనిపతియు
విఘ్ననాశక కర్మల వేదయుక్త
ములగువానినిచేయుచు ,వలయునట్టి
కార్యముల్చేయ నానతి కరమునిచ్చె 4

మ. సరయూ తీరమునందు యజ్ఞవిధికై సద్వాస్తువుల్ కల్గగా
వరణీయమ్మగు యజ్ఞశాలలు దరిన్ బ్రహ్మల్ వసింపంగ మం
దిరముల్ దాపుల శిష్యసంతతికినై తీరౌ కుటీరంబులున్
వరుసన్ వేసిరి అశ్వమేధ మఖమల్ భాసిల్ల నిర్విఘ్నమై. 5

శా. సామాన్యుల్ వసియించి జన్నముల నాస్వాదింప యోగ్యంబులౌ
ధామమ్ముల్ విపులమ్ములై తనరగా స్థాపించి రెన్నెన్నొ యా
శ్రీమంతుల్ వసియింప సౌధములు నిర్మింపించి రమ్యమ్ములౌ
భూమార్గమ్ములు వేసి దీపకళికల్ భూషించిరద్దారులన్ 6

మ. ధరణీపాలురు రాణివాసములతో తంత్రాంగ మంత్రాళితో
వరయోద్ధల్ గుణశీలురౌ భటులతో వాసింప భవ్యమ్ములౌ
గురువై సద్రమణీయమై సుఖదమై క్రొంగొత్త వై నొప్పు శ్రీ
కరమౌ శిల్పమయమ్ములౌ నగరులన్ కట్టించె శీఘ్రమ్ముగన్ 7

ఉ. వచ్చు జనాళికెల్ల రుచివంతమునై శుచిమంతమై ప్రజల్
మెచ్చెడి శాకపాకములు మిక్కుటముల్ తగవండి వార్చగా
ఎచ్చటికచ్చటన్ పరిమళించెడి పెక్కు లు వంటశాలలున్
గ్రచ్చర కట్టినార లవిరామముగా పతి యాజ్ఞకైవడిన్ 8

సీ. కస్తూరి కలయంపి కడుచక్కగాజల్లి
ముత్యాలముగ్గులు పోహళింప
మామిడాకులతోడమరకతమ్ములుగూర్చి
తోరణమ్ములుకూర్చి సౌరుపెంచ

చిత్రవర్ణాంబర శ్రేణులు తోడుత
ద్వారబంధాలకు వన్నెకూర్చ
చిత్రచిత్రములైన చిత్రాలు చిత్రించి
గేహకుడ్యములెల్ల కీలుగొలిప

తే.గీ. రత్నదీపాల వరుసలు రాజిలంగ
వీథి యరుగులు వెలుగుల వీడులయ్యె
కొబ్బరాకుల పందిళ్ళు కూర్చువేళ
వీథులన్నియు తిరునాళ్ళ వేడుకయ్యె 9

తే.గీ. అట్టులాయయోధ్యాపురి నందముగను
ప్రజ లలంకరించిరి యాగవైభవమ్ము
చూడవచ్చిన వారలు శోభలీను
పురముజూచుచు మనమున మురియునటుల. 10

చం. తమతమ బంధుమిత్రులను తాతల తాతలనాటి చుట్టలన్
రమణుడు చేయుజన్నమున రాజిల పిల్చిరయోధ్యవాసులున్
తమతమ గ్రామముల్ విడిచి దాయల గూడుచు నశ్వమేధపున్
రమణత గాంచ వచ్చిరవిరామముగా జను లుప్పెనట్టులన్ 11

సీ. సకలశాస్త్రవిదుడు శౌర్యప్రతాపుడు
జనకమహారాజు సత్యవాది
వృద్ధుడౌ ధర్మంపు బద్ధుడౌ మామయౌ
కేకయ రాజ్యంపు క్షేత్రపతిని
ఆప్తమిత్రుండునై యటుప్రియవాదియౌ
కాశీ మహారాజ్య ఘనుని పతిని
అంగదేశాధీశు డసమాన కీర్తియౌ
రోమపాదు హితుని క్షేమకరుని

తే.గీ. చెలిమి సౌరాష్ట్ర సౌవీర సింధుపతుల
దక్షణాపథ రాజ్యంపు ధరణిపతుల
పిలువ పుత్తెంచె మంత్రుల విప్రవరుల
యజ్ఞ కార్యంబు వీక్షింప నవనిపతియు 12

ఆ.వె. ధరణిచుట్టివచ్చె తురగమ్ము వత్సర
కాలమందయోధ్య ఘనతమీర
వచ్చునట్టియజ్ఞ పశువును పూజించి
యూపదారువు కడ నుంచిరంత 13

మ. నవరత్నమ్ముల రాసులన్ కనకరత్నాపూర్ణ వస్త్రంబులన్
ధవళమ్మొజవనాశ్వపంక్తి బలువౌ తండంబులౌ దంతులన్
స్తవనీయమ్మగు పైడి భూషణములన్ సర్వంసహాజేతకున్
భువిరాట్టుల్ బహుమానపూర్వకముగా పుత్తెంచినారప్పుడున్ 14

ఉ. మంగళతూర్యరావములు మంద్ర మనోహర వేదమంత్రముల్
సంగమమై సుధాజలధి జయ్యన లేచు తరంగ ఘోషగా
పొంగుచు వీనులన్ దవుల మూర్తపు వేళల గేస్తురాంద్రతో
శృంగమునీంద్రుతో ధరణిసింహుడు వచ్చెను యజ్ఞవాటికిన్ 15

తే.గీ. శాస్త్ర విధివిధానముచేసి సకల యజ్ఞ
హోమగుండమ్ములన్నియుహేమమయము
లైన నిటుకలతోడుత నద్భుతముగ
వరుసనిర్మించి రయ్యెడ పాటవమున 16

తే.గీ. అంతట ప్రధాన ఋత్విజు డౌచు నొప్పు
ఋష్యశృంగుడు వేది వసించె ధరణి
పతియు భార్యలతోడుత వహ్నికార్య
మునకు పీఠి వసించెను మ్రొక్కులిడుచు 17

చం. శ్రుతిగతయజ్ఞమంత్రములు రుక్కుల వోలెను దిక్కులల్ల నా
హుతవహునిన్ రగిల్చిరట నుద్ధతి కీలలు పెచ్చురేగగా
ఘృతమును వ్రేల్చుచుండ పెనువృత్రము నౌచును ధూమమంతటన్
సతతము సాగె నధ్వమున చారణు లెల్లరు మోదమందగన్ 18

ఉ. యాగవిరామ కాలమున యాజ్ఞికు లెల్లరు శాస్త్రచర్చలన్
సాగ పురాణ గాథలను చక్కగ చెప్పుచు కొందరొప్ప ను
ద్యోగపు ధర్మమున్ మసలుచుందురు కొందరు శిష్యకోటికిన్
యాగపు తంతు తెల్పెదరు యాజ్ఞికు లంతట యజ్ఞవాటికన్ 19

సీ. హరిహరాద్వైతమ్ము నలరారుగాథల
ప్రవచించు నొకకడ పండితాళి
ధరణి రాజులశౌర్యధైర్యంపు కథలను
యక్షగానము చేసిరంత నొకట
నవరసభరితమౌ నాట్యంపు విభవమ్ము
కనులుచెదర చూపిరనవరతము
భయసంభ్రమముగొల్పుబలవిద్యలొకకడ
చూపుచుండిరి జనులూచుచుండ

తే.గీ. యాగమారంభమైనట్టి యాదినమ్ము
నుండి చివరిదనుకను వినోదములగు
పెక్కు కార్యక్రమములను పెట్టినారు
దివ్యమోదాన జనులను తేల్చుకొరకు 20

ఆ.వె. సోమలతలరసము సోమిదేవమ్మతో
సోమిదేవుడగుచు భూమిపతియు
త్రాగె, యజ్ఞవాజి దాస్యమ్ము కౌసల్య
పట్టమహిషియయ్యు భక్తిచేసె 21

చం. శ్రుతిగత యజ్ఞకర్మలను శ్రోత్రియులున్ వచియించునట్లుగా
సతతమునాచరించి వరుసన్ దివి వంద్యుల దేవతాదులన్
హుతవహుపూర్వకమ్ముగ హూతి యొనర్చి హవిస్సులిచ్చె భూ
పతి యట ఋత్విజాళికి నపార ధనమ్ములనిచ్చె భక్తితోన్ 22

## రావణవధకు దేవవ్యూహము

తే.గీ. పుడమినిట్టులయజ్ఞంబుముగియుచుండ
సమయమిదియంచుదేవతల్ స్రష్ట జేరి
రావణాసుర దౌష్ట్యంపు క్రమము దెలిపి
శరణుకోరిరి రావణాసురునినుండి. 23

మ. సురముఖ్యుల్ శరణంచు చేర విధియున్ శోధించి పౌలస్త్యు స
ద్వర ధైర్యమ్మునెరుంగు వాడగుచు శ్రీ దామోదరుండొక్కడే
తరణోపాయము చూపువాడనుచు దైత్యారాతులంగూడి చె
చ్చెర వైకుంఠము జొచ్చె ధాత జగతిన్ క్షేమమ్ముగా నిల్పగన్ 24

చం. సురగణముఖ్యులన్ గలిసి జోతలు పెట్టుచు వచ్చు పుత్రునిన్
చిరునగవొల్క చూచి హరి చెప్పు డటంచును సావధానుడై
స్థిరమతి నొప్ప దేవతలు చేతులు మోడ్చుచు దైత్యుబాధలన్
వరుసగ చెప్పసాగిరి విభావసు డాదిగ రుద్ధకంఠమున్ 25

ఉ. రావణు రాజ్యమయ్యెను ధరాస్థలి సర్వము దేవలోకమున్
రావణుడాక్రమించె పలు రక్కసి మూకలు పెచ్చురేగి య
జ్ఞావరణమ్ములన్ జెరను శాస్త్ర విశేషపు ధర్మకార్యముల్
ఠావులు దప్పె వేదతతి డంబము సర్వము మాసిపోయెడిన్ 26

చం. మునుల తపమ్ములా తొలగె మోక్ష కరమ్ములు యాగదీక్షలా
వనమున కానరావు శ్రుతి పాఠము లన్నియు మూగబోయె పా
వనమగు నగ్నికర్మలకు భంగము లేర్పడె వేదగోష్ఠులా
వినపడవాయె నెత్తరిని విష్ణుకథాశ్రవణమ్మె మృగ్యమౌ 27

సీ. వెన్నెల రేరాజు వెల్గుల దీపమై
        యవ్వాని నట్టింట నమరియుండు
వేడివెల్గులరేడు వెలుగుల బింబమై
        యవ్వాని లంకలో నలరుచుండు
తోయేశుడౌ పాశి తోటమాలిగమారి
        యవ్వాని తోటల నంటియుండు
పరమ పవిత్రుడౌ పావకు డవ్వాని
        వంటింటి మనుజుడై వరలుచుండు

తే.గీ. వారు వీరిని వారని పలుకనేల
త్రిభువనేశుడు గోత్రారి దేవవిభుడు
వానిమ్రోలను శీర్షమ్ము వంచినిలచు
వాని చేసైగలన్ బట్టి పలుకుచుండు 28

తే.గీ. ఇట్టు లమరులు కష్టముల్ పట్టితెలిపి
వెన్నుసన్నిధి తలవంచి ఖిన్నులైరి
దానవాధము వధియించు తంత్రమొకటి
చక్కచెప్పుడటంచును చక్రిపలికె 29

చం. హరిహరులైనగాని యసురారులు గాని మృగాళిగాని సం
గరమున వానిగెల్వ కడుకష్టము మృత్యువు లేదువానికిన్
వరములజేసి యయ్యునొక వైఖరి నొప్పెను ధర్మమూర్తియౌ
నరుడె జగాన మృత్యువగు నంజుడు మేపరిగాని కెప్పుడున్ 30

మ. ఇనవంశంబున పుట్టి ధర్మపరుడై ఐక్ష్వాకుడై శూరుడై
ఘనుడై రంజకుడై ప్రజాప్రభువునై గంభీరుడై ధీరుడై
ఘనవేదమ్ముల రక్షకుందునయి శ్రీకాకుత్స్థుడొప్పారె స
జ్జనుడై పంక్తిరథుండు భూస్థలిని రాజ్యమ్మంత పాలించుచున్ 31

తే.గీ. అట్టి పుణ్యాత్ముగర్భాన నవతరించి
దేవకార్యంబు తీర్చుడు దివ్యమగును
మానవీయంపు వర్తనన్ మాన్యులగుడు
ననుచునౌచిత్యతంత్రంబు నజుడు పలికె 32

తే.గీ. వల్లె యనిచక్రి యభయమ్ము వారికిచ్చి
వీడుకొల్పంగ దేవతల్ వీడుచేరి
తొల్లియట్టుల దనుజుల కెల్లవేళ
వినయ వినమిత గాత్రులైచనిరియపుడు 33

మ. నరరూపమ్మున మాధవుండు ధరణిన్ నవ్యావతారుండునై
సురలన్ గావగ వచ్చుచో బలగమై శోభించి వెన్నంట వా
నరులై మీరలు పుత్రరూపమున గంధర్వాప్సరోభామినీ
వరలందున్ భువి పుట్టుడంచు విధి దేవవ్రాతమున్ జెప్పగన్ 34

సీ. వాలిజనించెను వాసవు నంశాన
సుగ్రీవు డుదయించె సూర్యువలన
తారుడు జన్మించె చారుని యంశాన
నీలుడు జన్మించె నిప్పువలన
నలుడుదయించెను నాకశిల్పి వలన
శరభుడు పర్జన్య శాసనమున
వాయుదేవుని నంశ పావని యుదయించె
వానరప్రముఖుడై వరలుచుండు

తే.గీ. బ్రహ్మ యావులింతకు జాంబవంతుడంత
పుట్టె తొల్లిట దేవతావ్యూహ మిటుల
దనుజ సంహార మునకునై కొనలుసాగ
భరణి నిండెను భల్లూక వానరములు. 35

చం. గిరిశిఖరమ్ములన్ బెరికి గిర్రున ద్రిప్పుచు పారవేయు ను
ద్ధుర బలశాలులౌచు పలు తోరపు దంత చయమ్ము వాడియౌ
కరనఖముల్ గలట్టి ప్లవగమ్ముల గుంపు లరణ్యభూములన్
సరగున వ్యాప్తిచెందె విధి శాసనమున్ తలదాల్చినట్లుగన్ 36

తే.గీ. అశ్వమేధమ్ము పరిపూర్ణమైనపిదప
పుత్రకామేష్టికై రాజు పూనుకొనియె
ఋష్యశృంగుడు హోతయై ఇష్టినడుప
నియమనిష్ఠల భక్తి మై నిలచెరాజు 37

ఉ. నిప్పుక లుప్పతిల్ల పొగ నింగిని తాకగ వేద ఘోషలున్
చప్పున మిన్నుముట్ట శ్రుతిసంహిత పేర్కొనునట్లు హోమముల్
కప్పురగంధులన్ కలిసి కాంక్షలు తీర ఘటించెరాజు పెన్
దొప్పల నేతులెల్ల శ్రువతుత్థము లందున వేగబోయుచున్ 38

ఉ. యాగసమాప్తివేళ నొకదద్భుతమున్ జనియించె గుండమున్
రేగిన అగ్నికీలల తరిన్ కనిపించెను రూపమొండు పూ
ర్వాగమ సూర్య తేజనిభమై వెలుగొందుచు హాసపూర్ణమై
దోగుచు హస్తపద్మముల ద్యోతమునౌ కలశమ్ము తోడుతన్ 39

తే.గీ. ఋష్యశృంగుడు భూపతి ఋత్విగాళి
సభ్యు లెల్లరు నాశ్చర్యచకితులగుచు
ఆసనమ్ములు డిగ్గి మర్యాద చేసి
ఇష్టి విభునకు ప్రాంజలులిచ్చిరంత 40

ఉ. ఇనకులవంశభూరమణ! యిష్టి యొనర్చితి దేవతాళికిన్
మనమున తృప్తికల్గె జనమాన్యులు పుత్రులు నీకుగల్గ నీ
ఘనమగు పాయసాన్నమును గ్రన్నన నిచ్చిరి నీదుపుణ్యముల్
గన ఫలియించె దీనిగొని కామ్యము తీర వసించు సౌఖ్యమున్ 41

తే.గీ. అనిన దశరథు డద్దాని నందికొనుచు
భక్తి యుతముగ దర్భల పైననునిచి
గంధ పుష్పాక్షతలతోడ క్రతు విభునికి
పూజలొనరించి యాతని పుచ్చెనంత. 42

తే.గీ. సగముకౌసల్యకుమిగులు సగములోన
సగమును సుమిత్రకున్ దాన సగము కైక
కొసగ మిగులునద్దాని తానొసగె విభుడు
పాత్రతో కొనుమనుచుసుమిత్రకంత 43

ఆ.వె. పరమఫలమునైన పాయసాన్నంబును
ఇటుల గేస్తురాంద్ర కెల్లపంచి
ఆత్మతృప్తిపడగ నవభృథస్నానాన
యాగ పరిసమాప్తి నంత చేసె 44

మ. నవరత్నమ్ముల భూములన్ ధవళలన్ నానావిభూషాళులన్
జవనాశ్వమ్ముల తేరులన్ గజములన్ ఛత్రంబులన్ టెక్కెలన్
ధవళమ్మోపలు పట్టువస్త్రముల దా దానమ్ములన్ జేసె నా
స్తవనీయుండగు చక్రవర్తి ధరణిన్ చారిత్రమై నిల్చుచున్ 45

తే.గీ. యజ్ఞఫలితంబు పాయసమారగ్రోలి
పడతులంతట నెలదప్పి బరగువేళ
దశరథుం డొక్కడే కాదు ధరణియంత
సంతసంబున వేడుకల్ జరుపుకొనిరి 46

సీ. కారుమేఘముగుంపుకదులాడునట్టుండె
గర్భంపు వ్రేగుతో కదుల సతులు
విరబూచు చూతంపు విరితోటనానొప్పె
సీమంతసౌందర్య సీమలకట

గంగా ప్రవాహంపు గంభీరమొప్పారె
మందగమనలైన మానినులకు
ఫలభారమునచేసి వంగినకొమ్మలా
నెలలునిండారగ నెలతలంత

తే.గీ. మంత్రసానుల వైద్యుల మగువలంత
అంతిపురమున నొప్పారె నవసరమ్ము
కొరకు, రాచకార్యములన్నికూడవిడిచి
అంతిపురమునువీడడాయవనిపతియు 47

సీ. చైత్రశుద్ధ నవమి శ్యామలవర్ణుని
కౌసల్యపుత్రుని గాంచెనంత
చైత్రశుద్ధదశమి శ్యామలవర్ణుని
కైకేయి పుత్రుగా గాంచెనంత
దశమి గడియలందు ధావళ్యమూర్తులై
పుత్రులొడమిరి సుమిత్రకపుడు
కర్కాట మీన కర్కాట లగ్నములను
పుత్రులు నల్వురు పొడమి రకట

తే.గీ. గ్రహములన్నియు శుభములు గల్గజేయు
క్షేత్రమందుననొప్పార సింహబలులు
భాగ్యశాలులు, వీరులు, భవ్యమతులు
పుత్రులుదయించి రైక్ష్వాక భూమిపతికి. 48

తే.గీ. పూలవానలు గురిసెను మ్రోగె నంత
దేవదుందుభుల్ గాంధర్వ దివ్యగాన
లహరి కొనసాగె, రంభాది రమ్యనాట్య
ఫణితి విరిసె నాకసమందుభవ్యముగను 49

ఉ. లేదను మాట నీధరణి లేదె యటంచును పుత్రవంతుడై
మా దొర తేజరిల్లె యని మాన్యులు పౌరులు సంబరమ్ములన్
మోదముతోడ చేకొనిరి ముత్తెపు ముగ్గులు పూలతోడ జ
వ్వాది పునుంగు నత్తరుల వాసన తోడ పరీమళింపగన్ 50

మ. అవధానమ్ములు యక్షగానములు నృత్యాపూర్ణగీతమ్ములున్
నవలాకేళిక సంబరాలు నట నానావాద్య గోష్ఠుల్ తగన్
స్తవనీయమ్మగు రీతులన్ జనులు మోదమ్మున్ పురీవీధులన్
వ్యవధానమ్ములులేక చూపిరి యయోధ్యాధీశు భాగ్యోన్నతిన్ 51

మ. కవులన్ మన్ననచేసి గాయకులకున్ గర్మొత్తు చేనిచ్చి యు
త్సవముల్ చేసిన నాట్యకారులకు సత్కారంబులన్ జేసి వా
ద్య విశేషజ్ఞుల నాదరించి ద్విజులన్ ద్రవ్యంబుచే గొల్చి భూ
ధవుడున్ దా దగురీతి దానములతో ద్రవ్యంబు పైజల్లెడిన్ 52

సీ. రామచంద్రుండంచు రఘుకుల జ్యేష్ఠుని
కౌసల్యపుత్రుని ఘనుని పలుక
కైకేయి పుత్రుని గణుతించెనప్పుడు
భరతుడటంచును భవ్యముగను
లక్ష్మణుడంచును రాముని మిత్రుని
సౌమిత్రి నుడివెను చతురమతిని
శత్రుఘ్నుడంచును సౌమిత్రి బల్కెను
భరతుని మిత్రుని నిరతముగను

తే.గీ. ఆంద్రబిడ్డల గూడి యా యవనిపతియు
నామకరణోత్సవమ్మును నయము జరుప
నా వసిష్ఠుడు కులగురువంత పేర్లు
పెట్టె శిశువుల తారల విభవమొప్ప. 53

## శ్రీరాముని బాల్యము

సీ. రాచకార్యములందు రాజిల్లు నొకసారి
ముద్దుకూనలజూచి మురియుచుండు
మంత్రివర్గముతోడమంత్రాంగముల్చేయు
కన్నబిడ్డలనంత కలసివచ్చు
కవిపండితాళితో కావ్యచర్చలుచేయు
నాత్మజులన్ గూడి యాటలాడు
నటగాయకాళితో పటువినోదముదేలు
చిన్ని పాపల జూడ చేరవచ్చు

తే.గీ. రాచకార్యంబు లొకకంట రంజిలంగ
ఉద్వహులతోడి సాంగత్య మొక్కకంట
నొప్పుచుండగ దశరథుదుర్విపతియు
క్షణము తీరిక లేకయ సాగుచుండె 54

మ. జనబాహుళ్యముమెచ్చి సంతసముతో సంతానవంతుండునౌ
జనతాధీశుని చూడవచ్చిపతిదౌ సంతానసౌభాగ్యపున్
ఘనతన్ సుందర సౌకుమార్య కళలన్ గంభీరవాక్యాళితో
విన వేనోళ్ళను చెప్పికొందురకటా విశ్వమ్ము మోదిల్లగన్ 55

ఉ. పొత్తము పట్టిరంత పరిపూర్ణముగా పలువిద్యలన్ని వే
చిత్తమునందునాట వికసించిన జ్ఞాన సుమమ్ముభాతి న
త్యుత్తమపాలనా పటిమ యొప్పగ నొప్పిరి వేదపాఠముల్
కుత్తుకపట్టి రయ్యు పలు కోవిదు లెల్లరు మెచ్చ రాఘవుల్ 56

తే.గీ. సకలశస్త్రాస్త్ర విద్యలు సంతసమున
నేర్చినారలు రాఘవుల్ నేర్పుమీర
ఖడ్గయుద్ధాన నెచ్చట గానరాని
యున్నతమ్మైన శిఖరాల నొప్పినారు 57

తే.గీ. యుద్ధవిద్యల యందు సన్నద్ధులగుచు
రాటుదేలిరి శ్మశ్రువుల్ రాజిలంగ
యౌవనారంభు లైనట్టి యాత్మజులకు
పెండ్లి సేయంగ తలపోసె విబుధుడంత 58

## విశ్వామిత్రుని రాక

మ. రణతంత్రమ్మున పారగుండు ఘన శస్త్రాస్త్రంపు సంపన్నుడౌ
ధనమోహమ్ములు లేనివాడు నవ స్వర్ధామంపు నిర్మాత స
జ్జన సన్మిత్రుడు యోగిపుంగవుడు ధీ శాంతుండు బ్రహ్మర్షి యౌ
వనసంచారుడు గాధిసూతి యటకున్ వచ్చెన్ శుభాకారతన్ 59

చం. పతియు వశిష్ఠుడాది మునివర్యుల తోడుత స్వాగతించి స
న్నుతులిడి యర్ఘ్యపాద్యముల నర్మిలి నిచ్చిమహాసనంబునన్
శ్రుతి విహితంపు పూజలిడి సూర్య విభాకరుడౌచునొప్పునా
యతివిభు గాదిసూనుకడ నట్టుల నిల్చెను నిమ్నగాత్రుడై 60

మ. ధరణీకాంతుని క్షేమముల్ తెలిసి తద్ధర్మైక నిష్ఠాగతిన్
వరవాక్యమ్ములుపల్కి దేశహితమున్ భాషించి కోశంపు సు
స్థిరతన్ గోరుచు మంత్రతంత్ర విధులన్ శ్రేయమ్ము కాంక్షించి భూ
భరణు న్బూజలు గాధిసూను డకటా వాత్సల్యమున్ గైకొనెన్ 61

తే.గీ. ఘను వసిష్ఠుని చేరి తా కౌగలించి
వామదేవాది మునులను పలుకరించి
రాజముఖ్యుల కాశీస్సు లందజేసి
కాంచనాసనమున నొప్పె కౌశికుండు 62

మ. అనఘా ధన్యుడనైతి మీదుపద మాహాత్మ్యంబుచే సౌఖ్యముల్
కనగావచ్చును ధర్మసిద్ధి యగు ముక్కారుల్ సువృష్టిన్ మహా
ధనయోగమ్ములు గల్గునీ భువికి విద్యాసస్యసంపత్తిచే
నని భూకాంతుడు పల్కె కౌశికునితో నాహ్లాదమేపారగన్ 63

ఉ. వచ్చిన కార్యమున్ దెలుప ప్రార్థన చేసెద నెట్టిదేని నే
జెచ్చర చేయువాడ నిక సెంకలు చేయగనేల గోవులా
యిచ్చెద ధాన్యమా మిగులనిచ్చెద రత్నపు రాసులా సరే
యిచ్చెద దేశమైన మరి యిచ్చెద నిప్పుడె కోరుమా మునీ! 64

చం. అని ధరణీ విభుండటులనాడగ నుబ్బుచు గాధిసూను డౌ
నని విభుతోడపల్కి యిటులాడెను భూపతి సావధానమున్
విను మొక జన్నమున్ తలచి వేడుక జేయగ గుండమందునన్
దనుజులు రక్తమాంసములు దండడి పోసిరి విఘ్నకారులై 65

శా. వారాదుష్టులు దానవాధములు పాపాచారులున్ భ్రష్టులున్
శూరుల్ యుద్ధవిశారదుల్గగనసంక్షోభుల్ మహా మాయకుల్
చోరాగ్రేసరులైనవారినణచన్ శుద్ధుండ నౌనాకు నీ
తీరున్ సాధ్యము కాదు గాన వినుమా తీర్పంగ నిన్జేరితిన్ 66

ఉ. రాముడు రాక్షసాంతకుడు రాము డవక్ర పరాక్రముండు శ్రీ
రాముడు ధర్మమూర్తి జనరంజకు డాశ్రిత పక్షపాతి యా
శ్యాముని కాకపక్షధరు యాగము రక్షణ సేయ పంపుమో
ధీమణి! దాన నెల్లరకు దివ్య శుభమ్ములు గల్గు జెచ్చరన్ 67

తే.గీ. తడవులేదయ్య రాముని ధర్మవిదుని
యాగరక్షణ సేయంగ నడవులకును
నన్ను నమ్ముచునావెంట నడుపవయ్య
అనుచు కౌశికుడాడిన నవనిపతియయు 68

కం. మారాడగ నోరాడక
ధీరుండౌ దశరథుండు తేకువ లేమిన్
జేరగిలె నాసనమ్మున
నీరుం గనుగ్రుడ్లనిండ నెవ్వెరపడుచున్ 69

శా. మాయావుల్ బలవంతులౌ దనుజులన్ మర్దించి ఛేదింపగా
నాయీ సైన్యముతోడ వచ్చెదను జన్నంబున్ దగన్ కాచెదన్
నాయీ పుత్రుని చిన్నవాని విడుమీ న్యాయంబుకాదయ్య మా
యా యుద్ధమ్మున నోర్వజాలగలడా? యప్రౌఢుడౌరాముడున్ 70

ఉ. చిక్కిన పాలుగారు నును చెక్కిలి పోరదు గోరుముద్దలన్
చొక్కును తల్లిచేత శశి శోభల వర్ధిలు చిన్నిబాలుడా
యెక్కడ మాయగాండ్లును మదించిన దైత్యమహోమృగమ్ములౌ
రక్కసులెక్కడయ్య దయ రామునిపై నిడుడయ్యవేగమై 71

మ. ఎవరీ రాక్షసవీరులీ పగిది వే జృంభింప మూలమ్ము లై
ఎవరైయుందురు వారిశౌర్యవిభవం బేరీతి నొప్పారు నా
వివరమ్ముల్ తెలుపంగ కోరెదను నా విధ్యుక్తమున్ దీర్ప సం
స్తవనీయమ్మగు నాదుసైన్యతతితో జన్నంబు నేగాచెదన్ 72

కం. అని పతి మునిపతి నడుగగ
దనుజ పతిని గూర్చితెలిపి దైత్యుని విభవం
బును వర గర్వంబును బల
మును వివరించెను పతికిని మునిపతి యపుడున్ 73

మ. వరగర్వంబున వీర్యశౌర్యములచే పౌలస్త్యుడౌ రావణుం
డరులన్ దేవగణంబులన్ గెలిచి క్రోధావేశ సంపూర్ణుడై
హరివిద్వేషముతో తపోవనములన్ యజ్ఞాది కార్యంబులన్
చెరుపంజూచును వానియాశ్రితులె యీ ఛేదింపనౌ రాక్షసుల్ 74

తే.గీ. వార లనఘ మారీచ సుబాహులనెడి
పేర కామరూపులునౌచు వీరవరులు
యజ్ఞమునకు విఘ్నమ్ముల నడ్డుపడిరి
వారి తుదముట్టగాఁ జేయ వలయునయ్య 75

 మ. అనుచున్రాణ్మునియట్లుపల్క పతియున్ హాసంబు క్షీణింప గ్ర
న్నన ఖిన్నుండయి పుర్రచేయి తలపైనన్ జేర్చి పౌలస్త్యుడా
దనుజేంద్రుండు మహాబలుండు సుర గంధర్వాది త్రైలోక్యులన్
దునుమాడెన్ వినభీతిగల్గెడుసుమీ దుఃఖమ్మె యెప్పాటునన్ 76

ఉ. రాముడు చిన్నిబాలకుడు రాక్షస నాశము చేయలేడు నే
నీముని వెంటనేగి యట నేవురి దైత్యులతోడ పోరుచో
తామసుడైన రావణుడు తాల్మి వహించునె? యుద్ధనీతియా
భూమిధరమ్ముతో తొగరు పోరుట యంచు నమస్కరించుచున్ 77

ఉ. ఎద్దియొ పల్కియుంటి క్షమియింపుడు శక్తినిమించు కార్యముల్
వద్దవి చేయలేను చిరు బాలుడు రాముడు వాని వీడుడీ
పెద్దలు మీరు సర్వరణ విజ్ఞులు కావున మా యశక్తతన్
హద్దులజూడుడీ యనుచు నప్పతి పంక్తిరథుండు పల్కుచోన్ 78

చం. అనముని రుద్రుడౌచు నుచితాసనమున్ దిగి రూక్షనేత్రుడై
జననుత మాటనిచ్చి యది చక్కగ తప్పుదు పాడియౌనొకో
ఘనమగు మీదువంశమున గాంతుమె యెప్పుడు నిట్టివారి నే
జనియెద రిక్తహస్తముల చల్లగ నొప్పుము నీదువారితోన్ 79

తే.గీ. సృష్టికి ప్రతిసృష్టిని చేయు ఋషివరుండు
క్రోధ దందహ్యమానుడై గుబులురేప
భరణి సర్వమ్ము భయముతో వణుకుచుండ
నపుడు బ్రహ్మర్షియు వసిష్ఠు డంత పలికె 80

ఉ. శాంతి వహింపుమయ్య ఋషిసత్తమ మీరలు కోపగించుచో
నంతలు వంతలై తెగు ధరాధిపు డట్టుల పల్కుటెల్ల నా
సంతతి పైని మోహము ప్రసన్నులు కండిక సర్వకార్యపున్
చింతలుతీరు భూమిపతి చిత్తము సాగును ధర్మబద్ధమై 81

## వశిష్ఠుడు దశరథుని ఊరడించుట

మ. అనఘా! రాఘవ! సత్యవాక్య విభవా! యట్లాడి యమ్మాటలన్
తొనకంగానది తప్పుగాదె శుభసందోహమ్ములౌ యాగముల్
ధనధాన్యాది సమస్తదానఫలముల్ ధర్మైక నిష్ఠారతుల్
వనధిన్ గల్పుట గాదె గాన తొలిదౌ వాక్యంబు పాటింపవే 82

ఉ. ఆకృతిదాల్చు ధర్మమిత డద్భుత శస్త్ర విశారదుండు నీ
లోకమునందు మేటి రణరుద్రుడు నౌ ఋషిసత్తముండు ప్ర
జ్ఞాకరు డున్నతుండు పలు శాస్త్ర పురాణ ప్రవీణుడయ్య ప్రా
భాకరసన్నిభుండు గుణవంతుడు గాధిసుతుండు చూడగన్ 83

తే.గీ. అగ్నిమధ్యను నలరెడి యమృతమట్లు
కౌశికునితోడి రాముండు గరిమనందు
దనుజ సంతతులెవ్వారు ఘనులునైన
శూరు రామచంద్రునితేరిచూడలేరు 84

ఉ. దక్షుని కన్యలైన జయ తన్వియు సుప్రభ లిర్వురున్ మహా
దక్షులువీరులౌ సుత శతమ్మును గాంచిరి యెల్లవారికిన్
రాక్షసనాశనమ్ములయి గ్రాలు మహాస్త్ర విభూతులిచ్చి యీ
దక్షునకొప్పజెప్పిరి సదా నర జాతిని రక్షసేయగన్. 85

మ. అనఘా కౌశికుడెల్లశస్త్రములతో నాటాడు నూత్నమ్ములౌ
ఘనమౌ యస్త్రములెన్నియేని త్రుటిలో కైబూని సృష్టించు త
ద్దనుజాధీశుని గెల్చుటెంతపని యా ధర్ముండు నిన్గోరుటల్
కన సౌభాగ్యము నీకు నిచ్చుకొరకై కానోపు సందేహమా? 86

తే.గీ. ఆ వసిష్ఠుడు బ్రహ్మర్షి యట్టులాడ
పద్మమట్టుల దశరథు వదనమంత
విచ్చుకొన సంతసముతోడ విబుధుడంత
రామ లక్ష్మణులను పిల్చె రాజసముగ 87

తే.గీ తల్లి కౌసల్య బిడ్డల తనివితీర
కౌగలించుచు ముద్దులు వేగపెట్ట
తండ్రి దశరథుడంతట తనయులగొని
మూర్ధ మాఘ్రాణ మొనరించి ముద్దుచేసె 88

తే.గీ. చెలగె వేదోక్త మంగళాశీస్సులంత
నా వసిష్ఠాది ఋషివరు లనెడివేళ
రామలక్ష్మణ సహితుడై బ్రహ్మవేత్త
పతిని వీడ్కొల్పి యడవుల బాటపట్టె 89

మ. ఘనకోదండము చేతబట్టి బలుడై గంభీరుడై రాముడున్
వెనుకన్ లక్ష్మణమూర్తి విల్లుగొని దీపించెన్ విరాణ్మూర్తులై
మునివెంటన్ జనువేళ నచ్చెరువుతో పుణ్యాంగనాయుక్తులై
జనసామాన్యులు నిల్చిచూచిరి పురిన్ సంరంభ మేపారగన్ 90

తే.గీ. ధనువు నొకవైపు తూణీర మొనర నొక్క
వైపు రాఘవుల్ మునితోడ బయలుదేర
మూడు తలల నాగేంద్రమ్ము బుసలుకొట్టి
ఫణములెత్తుచు సాగునా బరిగెనపుడు 91

ఆ.వె. ఎండవేడితగ్గ నెఱ్ఱనిబింబమై
పశ్చిమాన నినుడు పరుగు తీసె
పొట్ట చేతపట్టి చుట్టి వచ్చిన పక్షు
లెల్ల గూడుచేర నెగురుచుండె 92

మ. పులులున్ సింహము లేనుగుల్ మృగములున్ ముప్పొద్దులన్ వేటకై
నలు దిక్కుల్ కలయంగ జుట్టి తమి సంధ్యాకాంతులేపారగా
పలుగాండ్రింపులు గర్జలున్ వనమునన్ వ్యాపింప భీతిల్లుచున్
నెలవుల్ చేరగ పర్వులెత్తె వడిగా న్దీపింప సందోహమై 93

తే.గీ. రవికి మలిసంధ్య రాఘవుల్ ప్రాంజలింప
తర్పణములిచ్చు రాముని తపసిచేరి
బల యతిబల నా విద్యల వరుసతోడ
మంత్రపూర్వకమ్ముగ నిచ్చిమహిమతెలిపె 94

చం. అలసట గల్గబోదు రణమందు, జయించెడి శత్రువీరులా
కలుగరు విశ్వమందు, నవకమ్మగు కాంతులు హెచ్చు, నెట్టివౌ
కలుషము లంటబోవు, శుభకర్మల చిత్తమునంటియుండు, నీ
బల యను విద్యలన్ గలుగ; వారలు పూజ్యులు లోకమందునన్ 95

తే.గీ. బ్రహ్మ ముఖమునబడసిన బలములివ్వి
ధారవోసితి శ్రీరామ దాల్పుమీవు
ప్రజల సంక్షేమమున్గోరు వానివౌట
ధర్మమర్మమ్ములన్ దెల్పి ధైర్యమొసగు 96

మ. అనఘా! రాఘవ! వీని మంత్రములు నిత్యమ్మున్ పఠింపంగ శో
భనముల్ గల్గును శౌర్యవీర్యధృతితో వాసించెదో యంచు నా
ముని మాన్యుండు వచింప వల్లె యని సమ్మోదమ్మునన్ విద్యలన్
గొనె నైక్ష్వాకుడు నాచమించి సరయూ కూలంకషాతీరమున్ 97

తే.గీ. గురువు సేవలోన తరియించి రాఘవుల్
సరయుతీరమందు గరికపైన
గాధిసుతుడునుడువు కమనీయవాక్కుల
వినుచు నిద్రలోన తనిసిరంత 98

ఆ.వె. తూర్పు తెల్లవారె తోతెంచె వెల్గులు
దైవనిర్ణయమ్ము దాటరాదు
కనులు విప్పి రామ కౌసల్యసుప్రజా
పురుష సింహ!నిదుర ముగియలెమ్ము 99

చం. అనుముని మాటలన్ విని రయమ్మున స్నానమునాచరించి ద్యో
మణికిని ప్రాంజలించి సురమాన్యుల కెల్లను తర్పణమ్ములన్
మును నిడి గాధిసూనునకు మ్రొక్కి రయాన ప్రయాణసిద్ధులై
ఘనమగు విల్లుఖడ్గములు గ్రన్నన దాల్చిరి రామలక్ష్మణుల్ 100

కం. గంగా సరయూ నదులకు
సంగమమౌతీరమందు సంపన్నంబై
రంగారు నాశ్రమంబును
చెంగటగని రాఘవులు విశేషములడుగన్ 101

మ. ఇదిముక్కంటి నివాసమయ్యయిటనే యిచ్చారతిన్ సత్తపో
విదుడౌచున్ విహరించు నీశ్వరుడు సద్వీర్యుండునై యొంటియై
అదియట్లుండగ మన్మథుండు సురరాడ్వ్యాపారమగ్నుండునై
గదియంబోవగ నగ్నినేత్రమున వేగాంచెన్ శివుండాతనిన్ 102

తే.గీ. గాఢమౌ నగ్ని కీలల కాముడంత
భగ్గుమని మండి పిడికెడు భస్మమయ్యె
నాటినుండియు మదను డనంగుడాయె
అంగదేశమ్మునా దీని ననిరి జనులు 103

మ. శివధామమ్మిది నిత్యపుణ్యమయమై చెన్నొందు నేపాపముల్
భవునిన్ గొల్చెడివీరి తాకవుసుమీ భవ్యప్రదేశమ్మునన్
రవికిన్ ప్రాంజలి పట్టివచ్చుటయ యార్యత్వమ్మునౌనంచు నా
స్తవనీయుండగు కౌశికుండుపలికెన్ ధర్మజ్ఞు డైక్ష్వాకుతోన్ 104

ఆ.వె. గాధిసుతునిరాక గాంచినమునులెల్ల
స్వాగతించి మునిని సత్కరించి
ఆశ్రమానరాత్రి నాదరమ్మున నొప్ప
పూర్వసంధ్య వెడల పుచ్చిరంత. 105

## తాటక వధ

మ. అనఘుల్ గంగను నావపై గడిచి కీకారణ్యమధ్యమ్మునన్
జనుచున్ దీర్ఘ విశేషవృక్షతతి విస్తారమ్ము గానొప్పు నీ
వన చారిత్రము లెల్లతెల్పుడనఘా ప్రావీణ్యమొప్పారగా
యని యైక్ష్వాకులు ప్రశ్నచేయ ముని యాహాయంచు వాక్రుచ్చెడిన్ 106

మ. ఒకనాడియ్యవి సర్వసంపదలతో నొప్పారు దేశమ్ములై
జనసంఘమ్ముల విస్తరిల్లెను కరూశమ్మంచు మల్దమ్మునా
గణుతింబొందెను నేడు యక్షసతిచే కారాటవీసక్తమై
వనగర్భమ్ముగ మారె క్రూరమృగ సంభారమ్మునై నిత్యమున్ 107

మ. కలదు సుకేతుడన్ ఘనుడు కంజజు భక్తుడు యక్షుడొక్కడున్
కలిమి గలుంగువాడు శుభకర్మల దేలెడిధర్మశీలుడౌ
కలుగదు సంతు; బ్రహ్మవర కారణమున్ బలవంతురాలునై
కలిగెనుకూతురొక్కతియ కాంతులు చిమ్మెడి చంద్రరేఖనాన్ 108

ఉ. తాటక యంచు పేరిడుచు తన్విని పెంచిరి ముద్దుచేయుచున్
గాటపు ప్రేమతోడ బలగర్వుని సుందుని తోడ పెండ్లి నా
ర్భాట మెలర్ప చేసిరట వారికి పుత్రుడు కల్గె గర్వియౌ
పోటు మగండు వాడు లఘుబుద్ధియు మూర్ఖుడు కామరూపియున్ 109

కం. మారీచుండని పేరిడి
గారాబముతోడ పెంచ కఠినాత్ముండై
క్రూరుండై మాయావియు
నై రాక్షస గతి మెలగుచు నలరారెను సూ 110

ఉ. రక్కసుడైన సుందుడు విరాగి తపస్వి యగస్త్యుతోడ కై
పెక్కి విరోధమంద ఋషి బింకము తోడ సునందుచంపి యా
తక్కుమరీచు తక్షణమ దానవు గమ్మని శాపమీయగా
అక్కులకాంతతాటక మహాబల గర్వముతోడ రేగినన్ 111

మ. తనపై చిందులువేయు యక్షిణిని క్రోధానన్ మునీంద్రుండు వే
గని ఛీరాక్షసియట్లునొప్పితివి రాకా చంద్రబింబద్యుతుల్
హననమ్మొచును నీదుమోము వికృతంబై భీతి గూర్చున్ సదా
యని శాపంబిడె నాటినుండి నర సంహారైక నిష్ణాతయై 112

చం. మలద కరూశ దేశముల మానవ జాతిని పట్టిచంపి యు
జ్వలముగ వెల్గుదేశముల సర్వము నాశముచేయ పట్నముల్
పలువిషవృక్షజాతులకు పాములకున్ ఖగపాళికెల్ల జీ
వులకును క్రూరజంతులకు మూల నివాసము నయ్యెచూడగన్ 113

ఉ. ఇయ్యడవిన్ సుఖమ్ముగ గమించిన నవ్వలిదౌ వనంబ రా
మయ్యరొ నాదువాసమట యజ్ఞము నిత్యము సాగుచుండె ప్రా
దయ్యములందులో పిశితధారలు వ్రేల్చుచు పాడుచేయ నీ
కయ్యము నిట్లుసాగు బహుకాలము నుండియు చెప్పవచ్చుచోన్ 114

ఉ. స్త్రీయని చంపరాదని యిసీయని తాటకనీక్షసేయుచో
ఆయమ క్రుద్ధయై మనల కడ్డగు దౌష్ట్యముచేయజూచు సత్
సాయక తీక్ష్ణఘాతమున శ్యామను చంపుము లోకకంటకన్
వేయుట తప్పుకాదు ధర విజ్ఞులు మెచ్చెదరెల్లవేళలన్ 115

ఉ. ధర్మము తప్పువారలను దండన సేయుట రాజధర్మ మీ
కర్మలపాపపుణ్యముల గానగరాదు ధరన్ విశేషమౌ
ధర్మమునిద్ది తొల్లిహరి ధర్మము మీరిన కావ్యతల్లినే
దుర్మతి యంచుచంపె గద తొయ్యలి యంచునుపేక్ష సేసెనే? 116

మ. అని మునిపల్కదాశరథి యంజలి పట్టుచు మీదుమాటలున్
మునివర మీరరానియవి పుణ్య కరమ్ములు లోకపూజ్యముల్
జనహిత కారకమ్ములును సత్యము లయ్యవి యట్లుసేయ మా
జనకుడు తెల్పె మీ పలుకె శాసన మంచును తొల్లి స్వామిరో 117

మ. అనికోదండమునెత్తి టంకృతులతో నార్భాటమున్ జేయుచో
వనమున్ భీకర శబ్దజాలమలమెన్ వన్యంబులౌ జీవులె
ల్లను వాసంబులవీడి పర్వులిడె జాలంబింతయున్ లేక యా
దనుజస్త్రీ హయమట్లు వచ్చెనటకున్ దందహ్యమానాకృతిన్ 118

మ. ఎవరీమానవు లల్పబుద్ధులకటా యిచ్చోటకేతెంచి పెన్
రవముల్ చేయుట యెంతధైర్యమహహా రక్తాశనమ్మేరి యీ
భువిలో వీరిని గాచువారెవరు? నాముష్టిప్రహారమ్ములన్
నవరంధ్రమ్ముల రక్తమోడ ననుచున్ నవ్వెన్ మహాక్రోధమున్ 119

సీ. గిరిశిఖరమ్ములు గిర్రున ద్రిప్పుచు
తాటక వేయంగ ధవుడు త్రుంచు
వృక్షముల్ పెకలించి విసరగా రాక్షసి
యవ్వాని ఖండించె నవనిపతియు
సుడిగాలిసృజియించిసుదతిమాయలు
చూప; చిరునవ్వుతోపతి చీల్చివేసె
ముష్టులు విసురుచు ముదిత పైపడు
చుండ; కరములుఖండించెఘనుడువిభుడు

తే.గీ క్రోధ రౌద్రాగ్నికీలనా రొప్పుచుండి
పర్వతము వోలె పైబడు పడతినంత
రామబాణమ్ము గురి పెట్టె రాఘవుండు
రాక్షసాంగను శిక్షించె ప్రజలుమెచ్చ 120

చం. ఘనవటవృక్షమొక్కతరి కాండము తోడుత నేలగూలెనో
యన నట దానవాంగన మహారవమున్ ధర కూలె దేవతల్
కని గొనియాడ, మానవులు గ్రన్నన కేలుమొగడ్చ, లోకముల్
ఘనహితమంచు వేపొగడ, కౌశికు డాశిషమిచ్చెనంతటన్ 121

మ. ఘనుడీరాముడు ధర్మమూర్తి సురలన్ కారించు దైతేయులన్
క్షణమాత్రమ్మున మట్టుపెట్టగలడీ కౌసల్య సత్పుత్రుకున్
ఘన శస్త్రాస్త్రపు సంపదల్ మునివరా! కైసేయుమంచున్ సురల్
వినయమ్మొట్టిపడంగ కౌశికునకున్ విజ్ఞాపనల్ చేయుచోన్ 122

తే.గీ. పశ్చమాంబుధి సూర్యుందు బరగువేళ
వేదవిహితంపుకర్మల వేగచేసి
తాటక వనమునందున ధర్మవిధులు
రాత్రిగడిపిరి మోదమ్ము రాజిలంగ 123

తే.గీ. పూర్వసంధ్యకు నంజలి పూర్తి చేసి
వినయమూర్తియు ధర్మంపు విజ్ఞుడగుచు
నాచమించుచు నొప్పె దర్భాసనమున
నపుడు రాముదు కౌశికు నాజ్ఞ చేసి 124

సీ. దండచక్రమొకటి ధర్మచక్రము కాల
చక్రమొకటి విష్ణుచక్రమొకటి
బ్రహ్మాస్త్ర మొక్కటి బ్రహ్మశిరమొకటి
వజ్రాస్త్రశూలముల్ వరుణ పాశ
నారాయణాస్త్రమ్ము నందనాస్త్రము తోడ
శివవిష్ణు శక్తులు చేరునిన్ను
గరుడ రాక్షస యక్ష గంధర్వనాగులు
నెదిరింప లేరెవ్వరెప్పుడనుచు

తే.గీ. దైవదత్తమ్ములీయస్త్ర తతులుచూడ
ఆమహా ప్రయోగోపసం హారములను
తెలిపె నమ్మౌని యంత నా దివ్యవిద్య
లెల్ల ధారవోయుచు రాఘవేంద్రునకును 125

ఆ.వె. గాధిసుతుని వలన గాంచినవిద్యలు
లక్ష్మణునకు నిచ్చె రాఘవుండు
ధీరులొకటియౌచు దివ్యాస్త్రసంపత్తి
పొందినారు శుభములొందుకొరకు. 126

## సిద్ధాశ్రమ చరితము

ఉ. జాతి విరోధమున్ మరచి చక్కగ సాగెడి జంతుజాలముల్
పూతమెరుంగులొప్పు బహుపుష్ప విరాజిత రాగవల్లరుల్
శీతల మంద వీచులు వశీకృత పక్షి సు కూజితమ్ములున్
భూతల దివ్యలోకమన మ్రోసెడి కానను చూచిరంతటన్ 127

తే.గీ. ఇట్టి యాహ్లాదకరమౌచు నెసగుకాన
కానలేదెందు నయ్యరో దీని తెరగు
తెలియజెప్పుడు నాకంచు ధీరుడైన
రాముడడిగె విశ్వామిత్రు బ్రహ్మ విదుని 128

మ. ఇది సిద్ధాశ్రమ మందురిచ్చటనె లక్ష్మీశుండు లోకార్థమై
సదయుండై తపమాచరించె యుగముల్ సత్సిద్ధి పొందంగ నా
యదితిన్ గూడిన కాశ్యపుండు హరికై యవ్యాజమౌభక్తితో
ముదిమిన్ వే తపమాచరించి బడసెన్ మోదంపు సంసిద్ధులన్ 129

తే.గీ. హరి తపమ్మున మునిగెడి యట్టివేళ
బలి విభుండునౌ దానవపతి యొకండు
దేవగణముల నోడించి దివ్యపథము
లాక్రమించెను లోకము లల్లలాడ 130

మ. బలుడై లోకములెల్లగెల్చి సురలన్ బాధించు దైతేయుడౌ
బలిచే మోక్షమునందగోరి సురలున్ పద్మాక్షునుంజేరి యా
బలిపీడల్ పరిమార్చిలోకముల కాపాడంగ ప్రార్థించుచో
తలయూచెన్ హరి స్వాదువీక్షణములన్ ధైర్యంబు చేకూర్చుచున్ 131

మ. జగముల్ గెల్చిన వీరుడౌచు స్థిరుడై సద్భక్తుడై దాతయై
తగుభాగమ్ములు దేవతాతతికి సుంతైనన్ నివేదింపకే
తగవౌ యాగములెన్నొ చేసి ధనముల్ దర్పమ్ము నిండార రే
పగలున్ దానముచేయు యాచకులకున్ వాంఛించు నద్దానినిన్ 132

మ. అదియట్లుండగ కశ్యపుండు రమణీయమ్మైన వాక్యంబులన్
సదయున్ విష్ణుని సన్నుతించి యనఘా సర్వమ్ము నీమాయయౌ
మదమాత్సర్య గుణాభిరాములము మేమా యందు సర్వమ్మునై
పొదలంజూడగ నవ్వికొందువుసుమీ ముప్పొద్దులన్ వేడుకన్ 133

శా. నీకా భక్తుడు దానవేంద్రుడు సురానీకమ్ముకా వైరి ము
ల్లోకాలెల్ల జయించి శౌర్యయుతుడై రోచిష్ణుడౌయింద్రునిన్
చీకాకుల్ పడజేసె దేవతలకున్ శ్రీగూర్చి యాగమ్ములన్
లోకస్తుత్యుల జేయ ప్రోడవు సుమీ లోకేశ! రక్షింపుమీ. 134

మ. తపముల్ చేసితి నగ్నిమధ్యమున నిద్రాసౌఖ్యముల్ మాని నీ
కృపచే నద్ది ఫలించు కాలమిదియౌ కీనాశు దర్పమ్ము వే
యపమార్గమ్ముల ద్రొక్కకున్న తమితో నాదిత్యుగా పుట్టి వే
రిపు పాదమ్ముల ద్రొక్కి రాజ్యరమ వజ్రిన్ బొంద నిప్పింపుమీ 135

ఆ.వె. అనుచు కశ్యపుండు నచ్యుతు ప్రార్థింప
వల్లె యని మురారి పలికె నంత
అదితిగర్భమందు నాదిత్యుడైపుట్టె
లోకరక్షణార్థ మేకపాత్తు 136

ఉ. వామనుడై మురారి బలి వాసము చేరగ చక్రవర్తి యా
స్వామికి నర్ఘ్యపాద్యముల స్వాగత సత్క్రియలెన్నొచేసి తా
క్షేమము లెల్లనారసి విశేషవిధిజ్ఞులు స్వామిమీరు మీ
కేమిడ తృప్తి గల్గు సెలవీయుడటంచును రాజుపల్కుచోన్ 137

కం. మూడడుగులవాడను నే
మూడడుగులె కోరికొంటముచ్చటయౌ నా
మూడడుగుల మేరయ నా
కేడుగడయయిడుముదానినింద్రారివిభూ 138

ఆ.వె. లఘువు నట్టులడుగ రాక్షసాధీశుండు
మూడడుగుల మేర ముదమునొసగె
లఘువుగురువునౌచు లక్ష్యమ్ము సాధింప
అణచె రాక్షసేశు నడుగు వేసి 139

ఉ. అట్టుల పూర్వవైభవము నద్రి విరోధికినిచ్చె; కశ్యపుం
డిట్టుల సిద్ధినందె, తపియించిన విష్ణుని యాశయమ్ములీ
పట్టుల సిద్ధినందె గరువమ్మగు కోర్కె లవెట్టివైన పో
చట్టునదీరు నిచ్చటనె శ్రాంతుల కెల్లరి కాటపట్టునౌ 140

ఆ.వె. శార్ఙ్గధన్వగొల్వ స్థాణ్వాశ్రమమువీడి
ఇటకు చేరియుంటి నిష్టిసలుప
విఘ్నరూపులైన వేల్పుదాయిల చంప
వలయు, నిష్టి సిద్ధి గలుగు నటుల 141

## విశ్వామిత్రుని యాగముకాచుట

మ. అని సిద్ధాశ్రమ గాథలెల్ల విశదమ్మొనట్లుగా తెల్పె రా
మునికిన్ కౌశికు డిట్లు వారలువడిన్ భూజాని సిద్ధాశ్రమం
బునకున్ సాగిరి వారలన్ మునివరుల్ పూజించి యర్ఘ్యాదులౌ
ఘనసంభారము లెల్లగూర్చిరపుడున్ కర్తవ్యనిష్ఠాత్ముడై 142

ఉ. రాముడు పల్కె నోమునివరా! ఘన యజ్ఞము నిర్వహింపగా
నేమి విలంబమయ్య యిట నిష్టికి యుక్తములైన వస్తువుల్
ధీమతులైన యాజ్ఞికుల దెబ్బున నిప్పుడ పిల్వనంపుడో
ఈమహి యజ్ఞభంగమొనరించెడి వారలు లేరు చూడగన్ 143

ఉ. దక్షులు మీరు యజ్ఞమును ధర్మము తప్పక చేయబూనుచో
దీక్షలునిష్ఠగైకొనుడు దివ్యులు మెచ్చగ యజ్ఞవేదికిన్
రక్షణ మేము గూర్చెదము రాక్షస కల్పిత విఘ్నతంత్రముల్
మక్షికమట్లు నల్పి యిది మాధరణీపతి యాజ్ఞయట్టులన్ 144

తే.గీ. వినయ ధైర్యమ్ము లొప్పార నినకులేశు
డాడ; మునులెల్ల సంతసమందుచుండ
నవ్వుముఖమునగడ్డమ్ముదువ్వుకొనుచు
క్రతువు ఫలమును భావించె కౌశికుండు 145

ఉ. జాగొక యింతలేక మునిసత్తము డగ్ని రగుల్పధూమముల్
సాగెను మిన్నుముట్ట స్వరసంగమ మౌచును వేదమంత్రముల్
రాగిల నాశ్రమంపు మునిరాజియు సభ్యులునౌచునొప్ప నా
యాగ మవిఘ్నమై తనరె నంతయు రాముడు రక్షసేయగన్ 146

తే.గీ. దండధరులయి రాఘవు లండయౌచు
ఇష్టి వేయి నేత్రాల వీక్షించుచుండ
విఘ్న రహితమ్ము యజ్ఞమ్ము వేదవిదులు
మెచ్చ నైదుదినమ్ములుం బేర్మినడిచె 147

ఉ. ఆరవనాడు వేదవిధి యజ్ఞము సాగుచునుండ నగ్నులున్
ఘోరతమమ్ముగా నెగసె క్రూరులు రక్కసు లెల్లమూకలై
చేరిరి యంబరాన విరజిమ్ముచు నొక్కిట రక్తమాంసముల్
వారలజూచి రాఘవుడు బాణము గైకొనె తమ్ముతోడుతన్ 148

శా. మారీచుండు సుబాహులిర్వురు మహామాయావులై సైన్యపున్
పారావారము వెంటరా క్రతువుకున్ వ్యాఘాతమున్ జేయుచో
ధీరుండౌ రఘువంశచంద్రుడును శీతేష్వస్త్రమున్ వేసెనా
మారీచున్ గురిపెట్టి వాడు తిమి ధామమ్మందు భీతిన్ పడెన్ 149

మ. బలగర్వోన్నతుడౌ సుబాహుడలుకన్ భాండమ్ముతో రక్తమున్
పలలమ్ముల్ గొని యజ్ఞగుండమున వే వంచంగ శ్రీరాముడున్
కలకందేరుచు నగ్నిబాణమున వే క్రవ్యాదు వక్షమ్ముపై
బలిమిన్ గొట్టగ నేలగూలె; ధరపై పర్జన్యపాతమ్ముగన్ 150

ఉ. నాయక హీనమౌగణము నల్దెసలన్ చెదరంగ దివ్యమౌ
సాయక మేసె రాఘవుడు శత్రు భయంబులు వాసె యాగమున్
శ్రేయము గూర్చుచున్ పొసగె శ్రీరఘురాముని శౌర్యవీర్యముల్
జేయని ప్రస్తుతించిరి ఋషిప్రవరుల్ గడు మోదమంచున్ 151

ఆ.వె. సిద్ధినందె తపము సిద్ధాశ్రమంబున
క్రతువు రూపమంది రామచంద్ర
నిన్నుమీరువారి నిఖిలజగతిలోన
గానమని నుతించె గాధిసుతుడు 152

## షష్ఠ్యంతములు.

శివధనువు ద్రుంచు వానికి
సవనమ్మును గాచునట్టి సావిత్రునకున్
భువిజామనోహరునకును
పవనాత్మజునేలుదొరకు ప్రఖ్యాతునకున్ 1

వాలిని కోలనేయు ఘన వైష్ణవ దీప్తికి నల్లవానికిన్
శూలి ధనుస్సునెక్కిడెడి సుందర మూర్తికి స్నేహశీలికిన్
వైళముతోడ కంధిని నిబద్ధము జేసెడి కార్యశీలికిన్
గోలకు వృద్ధకున్ ముగితి గూర్చిన వానికి భూమిజానికిన్ 2

క్రతువు చేసి జనించిన ఘనునకు, సవ
నమ్ము గాచిన విభునకు, నల్లకలువ
కాంతి నొప్పెడువానికి, కప్పురంపు
గంధి జానకి చేపట్టు కడిమిదొరకు 3

ఆశ్వాసాంతగద్య.
ఇది శ్రీకౌండిన్యస గో(త్రోద్భవుండు ఉపాధ్యాయుల వంశరాకాసుధాకరుండు
సూర్యకాంతనారాయణమూర్తి దంపతుల
అష్టమగర్భుండును మధురకవి బిరుదాంకితుండును అగు గౌరీశంకరునిచే
రచింపబడిన "శ్రీరామ కథామకరందము"
"బాలకాండ ము"నందు ద్వితీయాశ్వాసము
సర్వము సంపూర్ణము.
**–శుభమ్–**

# శ్రీరామ కథామకరందము

## *బాలకాండము*

## తృతీయాశ్వాసము

శ్రీముని మానసభృంగా
శ్యామల రుచిశోభితాంగ! జానకిసంగా!
భీమపరాక్రమశృంగా!
కామిత కాంచన కురంగ! కరుణతరంగా!

ఆ.వె. ఆశ్రమంబునందు నారాత్రిగడవంగ
పూర్వసంధ్యవిధులు పూర్తిచేసి
గాధిసూనుమ్రోల గౌరవమొప్పార
నిలిచి రాఘవుండు పలికెనంత 1

చం. మునిజనమాన్య మీపలుకు మూదల దాల్చగ సిద్ధమైతి మీ
రనుమతి నిచ్చుచో కఠినమయ్యును కార్యము చేయువారమం
చనగ స్మితాననుండయి యహా! రఘువంశజ! నామఖమ్ము నీ
రణకుశలత్వమున్ దనరె రాక్షస మాయలు నీరుకారగన్ 2

తే.గీ. కలదు మిథిలానగరమను ఘనపురమ్ము
సకలసంపదలకునెల్ల జననియగుచు
దాని జనక మహీపతి ధర్మవిదుడు
ప్రజల పాలించు దా జనరంజకముగ 3

చం. జనక మహీధవుండు నొక జన్నము చేయుచునుండె దానికై
మునులనుగూడి నేవెడలబోవుచు నుంటిని మిమ్ముగొంచు నో
రణవిదులార! నాజనక రాజుకడన్ శివచాపమొప్పె దా
నిని ధరియింప బ్రహ్మకును నేర్వగరానిది సుమ్ము ధాత్రిలోన్ 4

తే.గీ. గరుడగంధర్వ సిద్ధులకైన గాని
యక్షరాక్షస కిన్నరు లైనగాని
దేవ నాగకింపురుషులౌ దివ్యులైన
భవుని చాపంబు తాకంగ వలనుపడదు 5

మ. శివమై తాళ సమానమై కఠినమై చిద్రూపమై భారమై
రవితేజోనిభమై మహావిభవమై రమ్యమ్మునై యొప్పు నా
భవుచాపంబును దేవరాతునకు గీర్వాణుల్ ప్రసాదింప సం
స్తవనీయమ్మగుదానికిన్ దగిన పూజల్ చేసి కైమోడ్చెదర్ 6

తే.గీ. అద్ది జనకు నాస్థానము నందు గలదు
కనుల విభవమ్ముగా దాని గాంచవచ్చు
గాన గొంపోదు మిమ్మని గాధిసుతుడు
పలికి వనదేవతలతోడ పలెకెనిటుల 7

ఉ. వచ్చినకార్యమాయె ఫలవంతము నయ్యెను నాదుయాగమున్
జెచ్చెర ఉత్తరానగల శీతనగమ్మును చేరికొందు మీ
రిచ్చిన యాతిథేయమునకెంతయు తృప్తుడ నైతినంచు తా
మెచ్చుచు కౌశికుండు మునిమిత్రుల తోడ ప్రయాణమయ్యెడిన్ 8

తే.గీ. పశ్చిమంబున పయనించె భాస్కరుండు
సంధ్యవిధులను ముగియించి సంయమీంద్రు
లంత శోణనదీ తీర మందుచేరి
రాత్రి గడిపిరి సత్కథాలాపములను 9

## విశ్వామిత్రునికథ

మ. ఫలభారమ్మున వంగుపాదపములున్ వాసించుపుష్పాళికిన్
నెలవై దోచెడి వృక్షరాజములు రాణింపంగ రుచ్యమ్ములౌ
జలముల్ పారెడి వాహినుల్ సరళమౌ సద్వాయు సంచారముల్
గల దౌయివ్వనవాటి గాథవినగా కౌతూహలంబయ్యెడిన్ 10

కం. అని రఘువంశజుడడుగగ
వినకౌతూహలముతోడ విప్రులు నొప్పన్
ఘనుడగు విశ్వామిత్రుడు
తనచరితముచెప్పదొడగె తాలిమితోడన్ 11

ఉ. సజ్జనపూజితుండు గుణసంయుతు డార్యుడు ధర్మమూర్తి వి
ద్వజ్జన వేదియౌ కుశుడు తాత్త్వికు డాప్తుడుబ్రహ్మయోనియా
యొజ్జయ మాకు మూలముగ నొప్పె విదర్భియు భార్యయౌచు నా
సజ్జనసాధుమూర్తికిని సద్గుణ వంతులు పుత్రులొప్పగన్ 12

సీ. ఘనుడు కుశాంబుడు కౌశాంబి నగరము
స్థాపించి ధర్ముడై జరుపుచుండె
కుశనాభుడనువాడు కొంగ్రొత్త పురము మ
హోదయమనుదాని నొప్పియుండె
ఆధూర్తరజసుడు ప్లోదమౌ పురము
ధర్మారణ్యమునునిల్పి రాజునయ్యె
వసువునా కొమరుండు పాలించెను గిరి
వ్రజమను పురమును బలుడునగుచు

తే.గీ. సత్యవచనులు సద్గుణనిత్యరతులు
ధర్మవేత్తలు రణతంత్రకర్మవిదులు
జనహితమ్మును గోరెడి శాంతవరులు
రాజులై నడిచిరి జనరంజకముగ 13

మ. కుశనాభుండు ఘృతాచియందుకనియెన్ క్రొక్కారుమేఘంబులన్
వశమైసాగెడి మెర్పుతీగలనగా భాసిల్లెనా నూర్వురౌ
వశలన్ వారలు నూత్నయౌవనలునై వాహ్యాళికై హేలగా
వెస చన్దెంచిరి పుష్పవాటికను దీపించెన్ వసంతమ్మునాన్ 14

ఉ. వారలయందచందములు వారల హాస విలాసరేఖలున్
వారల యౌవనమ్ము మరివారల స్నిగ్ధ తనూవిలాసమున్
వారల సోగకండ్లు గని వాయువు దివ్యుడు చిత్తజాధ్యుడై
వారల వెంటనంటికొని పాయని ప్రేమ వచించె నిట్టులన్ 15

ఉ. ఓచెలులార మీసొగసు లొక్క క్షణమ్మును నిల్వనీయరే
దోచెను నాదుచిత్తమును దోయిలి పట్టుచు వేడుచుంటి న
న్నేచక పెండ్లిచేసికొనుడీ, స్థిర యౌవను లౌచు పూజ్యులై
వే చిరకీర్తినొందుడని వేయి విధంబుల వాయువాడుచోన్ 16

ఉ. కన్యలమయ్యమేము కులగౌరవ మెల్లెడనిల్పువారమై
జన్యుడు చూపువారలను జక్కగ పెండిలి చేసికొందు మే
మన్యులమాటలన్ వినమె యాద్యులు పూజ్యులు సర్వలోక స
మ్మాన్యులు మీరలిట్లనుట మందుని మాటలపోల్కి నొప్పెబో 17

మ. అనినన్ గన్నులు నెర్రవార ననిలుండౌ రూప గర్వంబుచే
ననునిట్లాడిరి కుబ్జలై వరలుడో నారీమణుల్ వేగమై
అనిశాపంబిడె ;వారుతండ్రికిని నుద్యానమ్మునన్ గాడ్పుతో
ననుమాటల్ వివరించి వాయుకృతమౌ యన్యాయమున్ దెల్పుచోన్ 18

ఉ. మీరలు లెస్సపల్కితిరి మీక్షమ మెచ్చగవచ్చు వంశపున్
గారవమెల్లనిల్పితిరి కన్నియలార! క్షమాగుణమ్ముచే
ధారణి సాగుచుండె నదె ధర్మము పుణ్యములెల్లదానచే
కూరునటంచు పల్కె తన కూతులతో కుశనాభుడంతటన్ 19

ఆ.వె. ఈడు వచ్చినట్టి యాడుపిల్లలకును
పెండ్లి చేయదలచి విబుధుడంత
తగినవరునికొరకు తగుమంత్రముల్చేసె
బ్రహ్మదత్తుడనెడి వాని దెలిసె 20

ఉ. చూళి మహర్షి బ్రహ్మకయి చొక్కి తపమ్ములు చేయువేళ నా
చూళికి సేవచేసె నొకసోమద యూర్మిళ కూతునిత్యమా
గోల యొనర్చు సేవలకు కోరు వరమ్ములనిత్తునంచు నా
చూళియు తృప్తి మై పలుక సోమద మ్రొక్కెను సంతసంబునన్ 21

ఉ. నేను పవిత్రకన్యకను నీదగు సేవల చొక్కుదాన సద్
జ్ఞాన మయుండవౌ కమలజన్ముని తుల్యుడ వీవు ప్రేముడిన్
జ్ఞానిని పుత్రుగా నిడుము జన్మము ధన్యతచెందునంచు నా
మానినికోర వల్లెయని మౌనియు పుత్రునను గ్రహించుచోన్ 22

ఆ.వె. బ్రహ్మదత్తుడనుచు వాకొందురవ్వాని
ఇంద్రుడమరనగరి నేలునట్లు
కనకమయము నైన కాంపిల్యనగరమున్
పాలనమ్ము చేసె ప్రజలు మెచ్చ. 23

మ. ఘనునిన్ సోమదు బ్రహ్మదత్తు విభునిన్ కాంపిల్యునిన్ పిల్చి మ
న్ననలన్ చేయుచు కన్యకామణుల నానందమ్ముతోపెండ్లి చే
సెను రాజౌకుశనాభుడున్ వధువులన్ చేసందె కౌంపిల్యుడా
క్షణమున్ ముగ్ధల రూపవైభవము ప్రాక్సౌందర్యమున్ బొందెడిన్ 24

తే.గీ. కొడుకుకై కుశనాభుండు గొప్పదైన
పుత్రకామేష్టి చేయంగ మునివిభుండు
కుశుడు నేతెంచి తుష్టుడై కొమరుతోడ
పలికె నిట్టుల సర్వంబు భవితతెలిసి 25

ఉ. యాగ ఫలంబునొందెదు మహామహుడౌ పురుషుండు పుత్రుడౌ
యోగముకద్దు వంగడము నున్నతి బొందును వాన నంచు తా
సాగెను స్వర్గసీమలకు; జన్నము సర్వసమాప్తినొందె తద్
యాగఫలంబుగా బడిసె నాత్మజు నా కుశనాభు డంతటన్ 26

తే.గీ. గాధి యనుపేర పిల్చిరి కర్మవిదుని
వారలేనాదు జనకులై వరలినారు
ఘనుకుశుని వంశమున్ బుట్టకౌశికుండ
నైతి ఇదిమాదు చారిత్ర మయ్య వినుడు 27

తే.గీ. సత్యవతిఋచీకునిభార్య సత్యవచన
నాకు సోదరి, కౌశికీ నదియటంచు
పారుచున్నది మంచుగుబ్బలిని చుట్టి
హిమగిరి శిఖరాలను సేవసించుచుంటి. 28

సీ. చిరుగాలి తరగల చెదరుముంగురులునా
సాంధ్యచీకటి తెరల్ సాగుచుండ
చెలి కాలి మువ్వల చెలగెడి రవళి నా
పక్షుల కిలకిలల్ బరగుచుండ
తెల్లచుక్కలతోడి నల్లచీరనుకట్టు
పడతినా గగనమ్ము బరగుచుండ
మొలకనవ్వులురువ్వుచెలియలిమోమునా
వేల్పుత్రోవల శశి వెలుగుచుండ

తే.గీ. సంధ్యగతియించి నక్తమ్ము సాగుచుండ
జంతుపక్షి వితానమ్ము శయనమొంద
రాత్రి పక్షులు చరియించ రయముతోడ
నిద్రదోగిరి మునివరుల్ భద్రులగుచు 29

తే.గీ. పూర్వ సంధ్యల విధులెల్లపూర్తిచేసి
శోణనదిదాటి నడచుచు శుభ్రచేరి
విశ్రమించిరి మునులెల్ల వేడ్కలలర
గంగచరితమ్ము కోరిరి గాధిసుతుని 30

## గంగావతరణము

మ. హిమవంతుండను పర్వతాగ్రణి కలండీయుర్వి భాగ్యోన్నతుం
డమలుండై మహితాత్ముడై ఘనుడునై యవ్వానికిన్ గంగనా
నుమనా నిర్వురు కూతులుంగలరు రూపోద్దీప్తలౌయున్నతుల్
సుమనస్సుల్ చదలేరు కైకొనిరి సచ్ఛోభల్ పిసాళింపగన్ 31

మ. ఉమనాకన్నియ సర్వశక్తియుతుడౌ యుగ్రాక్షుడౌ శూలియౌ
రమణీయుండగు గట్టువిల్తుకొరకై ప్రాచుర్యమౌ సంయతిన్
శ్రమలన్ బొందుచు పెండ్లియాడి విభుతో సంసారసంరంభమున్
క్రమమొప్పారగ నిర్వహించె యుగముల్ రమ్యాతి రమ్యంబుగాన్ 32

మ. ఘనతేజోమయులైనవారి యురవౌ గర్భంపు తేజమ్ము మే
దిని మోయం బహుకష్టమౌననుచు నా దివ్యుల్ శివుంజేరి ప్రా
ర్థన జేయన్ హరుడట్ల రెల్లుపొదలన్ రంహస్సుతో తేజమున్
క్షణమాత్రమ్మునజార్చె యగ్నిభవుడౌ షడ్వక్త్రుడున్ బుట్టెడిన్ 33

చం. శరజుడు నౌచు షణ్ముఖుడు జన్మము నందగ తీక్ష్ణకోపయై
గిరిసుత దేవతాళి గని కీడు నొనర్చి రపత్యహీనులై
వరలుడు మీరటంచు కటువాక్యపు బంధముతో శపించె నీ
ధరణియు సౌఖ్యహీనయగు తథ్య మటంచు శపించె నంతటన్ 34

తే.గీ. ఖిన్నులై దేవతా తతి మిన్నకుండ
మంచుకొండపై శిఖరికి మన్మధారి
పార్వతీదేవితో గూడి పయనమాయె
ధర్మ సంరక్షణార్థమై తపము చేయ 35

ఆ.వె. హరుని పుత్రుడంత సమరసేనానియై
సకల లోక హితము చక్కచేసె
శరవణభవు డంత శర్వాణి కిష్టుడై
విశ్వపూజ్యుడగుచు పేరునందె 36

ఆ.వె. గంగలోకమాత కల్మషహారిణి
దివ్యలోక గామి దేవ నదియ
పూజ్య యెటులనద్ది ముల్లోకముల్ చేరె
దాని గాథ తెలుపు ధర్మమూర్తి 37

మ. అనుచున్ రాఘవుడాడ మౌనివరులున్ హ్లాదంబుతో చూడ స
జ్జన సమ్మోదమునొంద హాసముఖుడై సౌమ్యంపు వాక్యాల కుం
భినికిన్ గంగమ వచ్చుగాథతెలిపెన్ విఖ్యాతమౌదాని దా
కనులన్ గట్టినయట్లు గాధిసుతుడున్ గంభీరకంఠంబుతోన్ 38

చం. సగరుడునా మహీవిభుడు సర్వ సమర్థుడు చక్రవర్తి సౌ
భగము నయోధ్య రాజ్యమునుబాలన చేసెను పెక్కువర్షముల్
సుగుణవతుల్ కళత్రములు శోభిలి రిర్వురు పుత్రహీనుడై
భృగుఋషికై తపమ్ములొనరించెను భార్యలతోడ నిష్ఠమై 39

ఉ. పెక్కురు పుత్రులున్ గలిగి విశ్వము నందున పేరుపొందెదో
ఒక్కడు వంశమున్ నిలుపు నొక్కెత గర్భమునందుపుట్టి వే
రొక్కతె శౌర్యకీర్తుల బలోన్నతు లర్వది వేలమందినిన్
చక్కనిపుత్రులం గనును క్ష్మాపతి! యంచు మహర్షి పల్కుచోన్ 40

ఉ. ఒక్కని వంశమున్ నిలుపు నున్నతు కేశిని కోరె కోరె దా
పెక్కురుపుత్రులన్ సుమతి, పెద్దది కేశిని పుత్రునొక్కనిన్
మక్కువ గాంచె వాని కసమంజు డటంచును పేరుపెట్టుచో
పెక్కులు దుష్టకార్యముల పేరుచు భ్రష్టుడు నౌచు నొప్పెడిన్ 41

చం. సుమతికి గొడ్డపుట్టె నవశోభల నొప్పుచు నేతికుండలో
సమమగు ముక్కలన్ దురిమి చక్కగ దాచిరి దానినుండి భూ
రమణుని పుత్రరత్నములు రాజిలి రెల్లరు నంశుమంతుడా
కుమతికి పెద్దవానికొక కొడ్కు జనించెను బుద్ధిమంతుడై 42

ఉ. జన్నము చేయగాదలచి సర్వము సిద్ధము జేయ భూపుడున్
గ్రన్నన దీక్షగైకొనెను రాజసమొప్పగ వైభవమ్ముగా
జన్నముసాగువేళ నటశక్రుడు దొంగిలె యజ్ఞవాజినిన్
జన్నము నాగిపోయె పతి సత్వరు డౌచును పల్కెక్రుద్ధుడై 43

మ. ఎవడో దుష్టుడు యజ్ఞవాజిగొనిపోయెన్ చూడనున్మత్తుడై
సవనమ్మాగెను సర్వమున్ వెతకుడీ సర్వంసహాచక్రమున్
జవమున్ బట్టుడు పశ్యతోహరుని శిక్షాయోగ్యు బంధింపుడీ
శివమౌ మీకు నటంచు క్షేత్రజులతో శ్రేష్ఠుండు వాక్రుచ్చెడిన్ 44

మ. గిరిసీమల్ విరిసీమలున్ వనములున్ క్రీడోపభాగమ్ములున్
ఝరులున్ చెర్వులు పంటభూములును వాసస్థానముల్ నూతులున్
పరవాసమ్ములు శత్రుదుర్గములు గుప్తప్రాంతముల్ గోతులున్
వరుసంజూచిరి రాజసూనులకటా బ్రద్నమ్ముకై తిర్గుచున్ 45

ఉ. అట్టుల వారు భూమిపయి యజ్ఞ తురంగము గానలేక య
ప్పట్టున భూమిద్రవ్వి బలివాసము చేరిరి యందునొక్కచో
పట్టపుటశ్వమున్ గనిరి వారికి చెంగట మౌనదీక్ష క
న్పట్టెఋషీశ్వరుండొకడు వారలు రౌద్రము తోడ చేరుచున్ 46

చం. అగణిత శౌర్యగర్వులయి యాగ తురంగముజూచి క్రుద్ధులై
సగరకుమారులున్ కపిలసన్ముని పై వడి దాడిసేయుచో
పగిలిన నిప్పుకొండ గతి భగ్గున మండుచు మౌనిసత్తముం
డొగి వడి హుంకరింప పడియుండిరి వారలు భస్మరాసులై 47

చం. వెడలిన సూనులా మరలి వీడును చేరరు యజ్ఞవాజిదౌ
పొడగన రాదు జన్నమును ముందుకు సాగ దదేమియయ్యెనో
నుడువుము సర్వమున్ దెలిసి నొక్కిలు చుంటిని నిట్లుచిక్కి యం
చడలుచు నంశుమంతుగని యాడెను భూపతి పౌత్రుతోడుతన్ 48

తే.గీ. వల్లె యనియంశుమంతుడు విల్లును గొని
తాత పాదాల మ్రొక్కి రథమ్మునెక్కి
యజ్ఞవాజిని వెదుకంగ నవనిగడిచి
బలినివాసము చేరెను బలియుడగుచు 49

ఉ. అట్టుల వేగసాగుచు మహాద్రి సమీపమునందు భస్మపున్
గుట్టలజూచి గుర్తెరిగి కుందుచు తర్పణమీయజూచి య
ప్పట్టున నీరుగానకయ పైతృక మెట్టుల చేయలేక ని
ట్టట్టున జూడ తార్క్ష్యుడు తటాలున కన్పడి యిట్లుచెప్పెడిన్ 50

ఉ. నీ పినతండ్రులా కపిలు నిర్దయకున్ బలియైరి వారలున్
శాపహతుల్ నభోనది రసమ్మున మోక్షముపొందువారలౌ
దాపుల నొప్పువాజిగొని తాతల యజ్ఞము నిర్వహింపు మం
చా పవనాశనాశుడటు లాడగ మ్రొక్కుచు నంశుమంతుడున్ 51

ఉ. జన్నము చేయగా విడుచు జక్కిని పట్టుచు యజ్ఞశాలకున్
గ్రన్ననవచ్చి యజ్ఞమును గ్రమ్మర సర్వసమాప్తిచేసి వ్య
త్పన్నుడు నంశుమంతుడును తాతకు పుత్రగతంపు వార్తలన్
ఖిన్నుడునొచుచెప్పె పతికీడ్పడె కాలము దొర్లిపోయెడిన్ 52

తే.గీ. అంశుమంతుడు రాజ్యమ్మునధివసించె
సగరసుతులకు మోక్షమ్ము చక్కచేయ
గంగసాధింప తపము చేయంగతొడగె
రాజ్యమిడుచు దిలీపుని ప్రభువు చేసి 53

తే.గీ. సకల జనరంజకమ్ముగ చక్రవర్తి
ఘన దిలీపుడు రాజ్యంబు గడిపియంత
సుతు భగీరథు రాజుగా క్షితిని నిలిపె
వృద్ధుడై దిలీపుడు భువి వీడిపోయె 54

ఉ. రాజ్యము మంత్రిసత్తముల రక్షణ నుంచి భగీరథుండు తా
పూజ్యుల తర్పణమ్ముకయి మోక్ష విదాయిని ద్యోసరిత్తుకై
భోజ్యము లెల్లవీడుచు నమోఘ తపమ్ములుచేసె వేదసం
పూజ్యుడు బ్రహ్మ దోచెకనుముంగిట రాజు తపమ్ము మెచ్చుచున్ 55

ఉ. కన్నులదోచు వేదవిదు కంజజు ప్రస్తుతి చేసి హస్తముల్
గ్రన్ననమోడ్చి దేవనది గంగమ తోడుత తర్పణమ్ములున్
మన్ననసేయగా వలయు మా పినతాతల నీకృపార్ఘురిన్
సన్నుత! వంశమున్ నిలుపు సంతతి నిమ్మని రాజుకోరగన్ 56

ఉ. మెచ్చితి నీతపమ్మునకు మేలగు నిత్యము నీదుపుత్రుడై
సచ్చరితుండుపుట్టు నిక స్వర్నది నీ వెనువంటవచ్చి యా
చచ్చినవారి కెల్లరకు సద్గతు లిచ్చును గంగ ధారుణిన్
గ్రొచ్చుచు జారు నావడిని బ్రోచెడి వాడు భవుండె విశ్వమున్ 57

ఆ.వె. అనుచు నజుడు పలికి చనియెను పైపైకి
శివుని కొరకు తపము చేసె విభుడు
బొటన వ్రేలిపైని పొద్దు గ్రుంకు వరకు
గాలిభోజనాన కదలకయును 58

చం. పరమ శివుండు భూరమణు భక్తికి మెచ్చుచు గంగదాల్చగా
వరమిడె; పుణ్యయౌ పరమపావని ద్యోనది యున్నపాటుగా
నురవడి పెంచి యంబరము నుండి మహాశివు శీర్షమందు పెన్
సరగున జారుచో చినుకు జారిన యట్లు చలింపడీశుడున్ 59

శా గౌరీశంకరుడట్లు విశ్వవిభుడై గంభీరుడై నిల్చుచో
గౌరీశంకర సానువట్లు శిరమున్ కన్పట్టె గంగమ్మ యే
దారుల్ గానక జూటమున్ తిరుగుచున్ దబ్బిబ్బునైదోగి యో
వారన్ జేరుచు సొమ్మసిల్లె నటులౌ ప్రౌఢత్వమున్ జూపుచోన్ 60

మ. చదలన్ సాగు తరంగగంగ వదులై సంరంభమొప్పార నా
మదనారిన్ దలపండుచేరి త్రుటిలో మాయమ్మునౌ వింతగా
ఇదిమాహేశ్వర మాయయౌయనుచు భూతేశున్ సదానందునిన్
సదయున్ ప్రార్థన జేసె భూమిపతి యా స్వర్గంగకై భక్తితోన్ 61

తే.గీ. జడల బంధింపబడినట్టి స్వర్ఝరిని
చిన్ని జడసందు నందుండి సన్నధార
గా విడిచె సదాశివుడద్ది కమలభవుని
బిందు సరసునపడియెనువెడదయగుచు 62

ఉ. బిందుసరస్సు నుండి కడువేగమ వెల్వడ దొర్లి ధారలై
క్రిందికి జారి మంచుమల శ్రేణుల దూకుచు గాలితేలుచున్
మంద మమందమై దిగుచు మంజు మృదంగ తరంగ రావమున్
చిందులువేసె నేలపయి జ్యేష్ఠ సరిత్తు మహోన్నతమ్ముగన్ 63

సీ. వెండికొండ ద్రవించి వెససాగి వచ్చెనా
చదలేరుభువిపైని కదలసాగె
పాలసంద్రము పొంగిభరణిముంచెత్తెనా
మిన్నేరు ధరణిపై మెలగసాగె
తెల్లని మేఘమ్ములల్లనజారెనా
గంగాజలమ్ములు కదలుచుండె
హంసకపోతమ్ములల్లాడి దోగెనా
ఫేనమ్ము రాసులై వెడలుచుండె

తే.గీ. నక్ర మీనాది జలచర చక్రమంత
గంగపొంగుల చెలరేగి కదులుచుండె
సింహశార్దూలభూచక్ర శ్రేణులన్ని
గంగలో బడి తేలుచు సంగమించె 64

శా. ఆకాశంబుననుండి మంచుమలపై నందుండియీభూమిపై
లోకారాధ్య యభంగగంగ పడుచో రోమాంచితోద్భాసులై
లోకుల్చూచిరి విస్తుబోవుచు సురల్ క్రొంగ్రొత్తదౌ వింతలన్
నాకమ్మంచులనిల్చి చూచిరి మహానాదమ్ములన్ జేయుచున్. 65

సీ. స్వరమోహనమ్మైన వరవేదగీతినా
గంగమ్మ నడయాడకలుగు హోరు
నట్టువాంగముచూపి నర్తించు భామనా
గంగమ్మనడకలో క్రాలు హొయలు
అష్టావధానాన నలరించు కవితనా
గంగమ్మగలగలల్ పొంగు గూర్చు
రసభావపుష్టమౌ రమణీయవాక్కునా
గంగాజలమ్ములు గరిమజూపు

తే.గీ. చెంగు చెంగున దూకెడి చిన్ని లేడి
విధము గంగమ్మపరవళ్ళు పెట్టుచుండె
శివుని జూటమ్ము వెడలిన చిన్ని యేరు
భూమి ప్రవహించె లోకాలు పులకరింప 66

ఉ. బిందు సరస్సునన్ బడుచు వెల్వడు గంగమ యేడుపాయలై
యందున పావనిన్ నళిని హ్లాదిని మూడును తూర్పు దిక్కుకున్
సింధు సుచక్షు సీతలను శేముషి నందిన మూడువాహినుల్
చిందెను పశ్చిమంబునకు, శేషము గంగమ యౌచుసాగెడిన్ 67

మ. ఘనయౌ గంగమ సాధ్వి యట్లు నొకచో గంభీరయైసాగు త
త్క్షణమున్ వక్రపు మార్గమున్నడిచెడిన్ కాశూలయౌభంగి వా
ణినినా దూకుచుసాగు నొక్కతరి తా నింపాదిసాగున్ నితం
బినినా నట్లు భగీరథున్ రథమునన్ వెన్నంటె హేలాగతిన్ 68

మ. దివిలో పారెడి గంగతల్లి భువిపై తెల్లేరుగా సాగ సం
స్తవనీయమ్మగు నీటిధారల జనుల్ స్నానమ్ములన్ జేయుచున్
దివమున్ జేరిరి, క్షుద్రజీవములు నేదెన్ పూర్వ కర్మంబులన్
శివశీర్షోద్భవి యంచు పూజలిడుచున్ సేవించె ముల్లోకముల్ 69

తే.గీ. అట్లు నా భగీరథువెంట నమిత వేగ
యౌచు సాగెడిగంగమ్మ యార్షవిదుడు
బ్రహ్మ వేత్త జహ్ను మహర్షి బరగునట్టి
ఆశ్రమమ్మును ముంచెత్తె నశ్రమమున 70

ఉ. జన్న మొనర్చుచున్న మునిసత్తము నాశ్రమ యాగవేదులన్
గ్రన్నన ముంచు గంగ గని గర్జన జేయుచు మౌనిరుద్రుడై
మిన్నులయేటి నీరుగొని మ్రింగెను చయ్యన, నెల్లలోకముల్
కన్నులు విచ్చి మైమరిచి గాంచగ క్ష్మాపతి తెల్లపోవగన్ 71

ఉ. తాపసి లోకపూజ్య వరదా! దయ చూపుమటంచు జహ్నునిన్
భూపతి సన్నుతించె సురముఖ్యులు ప్రార్థనచేయ నంతటన్
తాపసి శాంతిచిత్తుడయి తా చెవి రంధ్రములందునుండి గం
గాపగ సృష్టి జేసె భువి నయ్యది జాహ్నవి యయ్యె నంతటన్ 72

చం. అరదమునెక్కి రాజు చన నావెను వెంటను గంగసాగి సా
గరమును జొచ్చి క్రిందదిగి గ్రన్నన పారెను బూదికుప్పలన్
పరమపదించినట్టి భువిపాలకుమారుల కెల్లవారికిన్
పరము లభించె పాపమయ పంకము త్రెళ్ళెను మోక్షమందగన్ 73

తే.గీ. అట్టిసమయమందు నజుడు ప్రత్యక్షమై
పతిని మెచ్చుకొనుచు పలికెనిట్లు
సగరపుత్రులకును స్వర్గమ్ము చేకూర్చు
నీ ప్రతిన ఫలించె నిజముసుమ్ము. 74

ఉ. సాగరమందునన్ జలము స్థానికమై యలరారు దన్క నీ
త్యాగము శాశ్వతమ్మునయి ధారుణి వర్ధిలు స్వర్గలోకపున్
భోగము గల్గునా సగరపుత్రుల వంశము ఖ్యాతినందు నీ
యాగముచేసి గంగసుతయై ధర నీకును పేరుతెచ్చెడిన్ 75

ఆ.వె. సగరచక్రవర్తి సాధింపగాలేదె
అంశుమంతుతపములణగిపోయె
ఘనుడునౌ దిలీపు కర్తవ్యమానిల్చె
దివ్యగంగ ధరణి తెచ్చితీవు 76

చం. పరమపవిత్రమీజలము పాప వినాశము మోక్ష దమ్మునై
సురగణపూజితమ్ము శుభ శోభితమౌ నగు దీన స్నానమున్
త్వరితముగానొనర్చి పితృతర్పణముల్ విడుమంచుతెల్పి యా
సరసిజసంభవుండు తనస్థానము చేరెను సత్యలోకమున్ 77

ఉ. అంత భగీరథుండు నమరాపగ నందున పైతృకమ్మునౌ
తంతు నొనర్చె గ్రుంకులిడి ధర్మ విధిజ్ఞుడునౌచు దానముల్
సాంతము చేసి భూమి జను లాదరణమ్మును పొంది మిన్నయై
అంతిపురమ్ముచేరె ముదమందుచు రాజ్యము నేలుచుండెడిన్ 78

ఆ.వె. ఆకసమ్మునుండి యవతరించిన గంగ
గాథ లెల్ల నుడివె గాధిసుతుడు
వాని విన్నవారి వాంఛలెల్లను తీరు
నంత్యమందుమోక్షమందగలరు. 79

తే.గీ. రమ్య గాథలతోడ నారాత్రి గడిపి
పూర్వసంధ్యావిధులనన్ని పూర్తిచేసి
గంగ కుత్తర భాగాన గడచి గడచి
చేరిరి విశాలనగరమ్ము చింతలేక. 80

ఉ. సుందరమౌచు నీపురము శోభిలు చుండెను సస్యవంతమై
పొందిక నొప్పు నేల ఫల పుష్ప విరాజితమౌవనమ్ములున్
చందన వాసితమ్మునయి సాగెడి గాలులు దీనినెవ్వరై
యుందురుపాలకుల్ తెలుపుమోముని వందిత తీపిమాటలన్ 81

తే.గీ. వినయముట్టిపడగ విన్నపమ్ములజేసి
కథలు తెలుపుమనుచు గాధిసుతుని
రామచంద్రు డడుగ రమణీయవాక్కుల
మునియుతెల్పెపురము పూర్వగాథ 82

## అమృతమథనము

తే.గీ. తొల్లి కశ్యపుండను మునితల్లజుండు
గలడు భార్యలిర్వురుతోడ చెలియలందు
దితికి బలులగు దైత్యులు సుతు లదితి
గాంచె నాదిత్యులన్ బుద్ధిఘనులసుతుల 83

చం. ఘనులగు వారు మృత్యు జయ కారకమౌ యమృతమ్ముపొందగా
వనధిని చిల్కకవ్వముగ పర్వతమున్ గొని దానత్రాడుగా
ఫణిపతి వాసుకిన్ నిలిపి వైళము తోడుత ద్రచ్చుచుండ, నా
ఘననగమంత సంద్రమున గమ్మున జారెను మున్గిపోవగన్ 84

ఉ. మందర పర్వతమ్ము వడి మంధిరమందున జార నిందిరా
మందిరసుందరున్ వెస సమాశ్రయ మిమ్మని దేవదానవుల్
బృందమునౌచువేడ నరవింద దళాస్యుడు కచ్ఛపమ్మునై
సందరమందు జొచ్చి ఘనశైలము వీపున మోసె శీఘ్రమై 85

ఆ.వె. మంధిరంబునందు మథనమ్ము సాగుచో
హాలహాలము పుట్టి యవని గ్రమ్మె
నగ్నికీల లెగసి యాకసమ్మును దాక
సురలు దైత్యులంత పరుగులిడిరి

ఆ.వె. హాలహాలమునుండి యన్నిలోకమ్ముల
రక్షసేయువాడు రాజధరుడె
యంచుదేవదానవాదులు సర్వజ్ఞు
నీశ్వరేశ్వరుని నుతించిరంత 87

మ. వరదా! భస్మవిభూషితా! త్రినయనా! పంచాననా! పింగళా!
పురవైరీ! జడధారి! కల్మషహరా! భూతేశ! మృత్యుంజయా!
స్మరసంహారక! చంద్రశేఖర విభూ! సర్వజ్ఞ! సంహారకా!
కరుణాసాగర! మమ్ముబ్రోవు నిటలాక్షా! చంద్రమౌళీశ్వరా! 88

ఉ. అంత త్రిశూలధారి జగమందున సర్వము దానయౌచు రూ
పాంతరమందినిల్చెను నభమ్మును దాకెడి వాడు వంగి ర
వ్వంత హలాహలమ్మును చివాలున కుత్తుక ద్రిుంగి పట్టగా
నంతయు నల్లవారె నికనంతట నీలగళుండునయ్యెడిన్ 89

సీ. వైద్యశాస్త్రముతోడ వైదికధర్మము
నిల్పు ధన్వంతరి నెగడ నచట
అపురూప సౌందర్య మలరారుకొమ్మలౌ
యప్సరసలు పుట్టి రబ్ధియందు
కౌస్తుభరత్నమ్ము కల్పవృక్షమ్మును
చందమామయు పుట్టె జలధినుండి
సకలసంపన్నయై సౌందర్యరాశియై
శ్రీలక్ష్మి యుదయించె సింధువందు

తే.గీ. జలధిమథనమ్ము నట్టులసాగుచుండ
సూర్యతేజోనిభమ్మునై చోద్యమైన
మధుర సౌరభభరితమై మంగళకర
మైనయమృతమ్ముజనియించెనర్ణవాన 89

ఉ. దానవ పంక్తులెల్ల జలదమ్ముల కైవడి క్రమ్ముచుండ నా
దానవచక్రమున్ సురలు ధైర్యముతోడ నెదిర్చిపోరి యా
స్త్సైనము రక్షసేయుతరి చివ్వ భయంకరమౌచుసాగుచో
ప్రాణములెన్నొత్రెళ్ళె నిరు వైపుల సైన్యములందుచూడగన్ 90

ఉ. తుమ్మెదలట్టి చూపుగల తొయ్యలి యోర్తు విలాసహాసయై
గమ్మున స్త్సైనభాండమును గైకొని దివ్యులకెల్లపంచె మై
కమ్ములు గ్రమ్మి రాక్షసులు కల్లు భుజించుచునొప్ప దాన స
త్త్వమ్మునదేవతల్ చెలగి దానవ సేనల చిత్తుజేసెడిన్ 93

తే.గీ. అమృతమున్పొంది దేవత లసురసేన
నాశమొందింపదుఃఖపూర్ణయగుదితియు
భర్త కశ్యపు నీక్షించి పలికెనిట్లు
పుత్రశోకాన డెందమ్ము పొగులుచుండె. 94

చం. వరమొకటిమ్మునాకు బలవంతుడు పుత్రుడు కల్గునట్లు నా
పరుడగు నింద్రునిన్ గెలుచు వాడగు నట్టులటంచుగోరుచున్
కరములుమోడ్చ వల్లెయని కశ్యపు డాడుచు పల్కె వేయివ
త్సరములు నిర్మలత్వమున సంయతి నొప్పుము కోర్కెపండగన్ 93

ఉ. అట్టుల భర్తచే వరమునందుచు నామునిపత్ని నిష్ఠమై
పట్టినపట్టు వీడక తపమ్మును చేయుచు నుండె నింద్రుడా
పట్టున తల్లియౌ దితికి పాదము లొత్తుచు సేవచేయ నా
బెట్టిదమైన డెందమున ప్రీతి జనింపగ పల్కెనిట్టులన్ 94

ఉ. మెచ్చితి నీదు సేవలకు మేలగు నీకును వీర్యవంతుడున్
సచ్చరితుండు నాకొడుకు సర్వ జగమ్ములు నేలువాడునై
నిచ్చలు నిన్నుగైకొనుచు నీకు సుఖమ్ములుగూర్చుసుమ్ము నే
నిచ్చెడి రక్ష యిద్దియని యింతి వచించె మహేంద్రుతోడుతన్ 95

మ. ఘననిష్ఠన్ దపమాచరించె మునిరాట్ కల్యాణి మధ్యాహ్నమున్
తనపర్యంకము చేరికాళ్ళకడిపై దైర్ఘ్యమ్ములౌ కేశముల్
తనరన్ శీర్షము వాల్చినిద్రతనరెన్ తద్దోషసంపత్తిచే
ముని భార్యా శుచిమంతమౌతపము తా మొత్తమ్ము మైలయ్యెడిన్ 96

మ. సమయంబియ్యదియంచుదేవపతి సూక్ష్మత్వమ్మునొందింది యా
రమణీగర్భముజొచ్చి వజ్రహతిచే రంజిల్లుపిండమ్మునున్
సమఖండమ్ముల నేడు చేసె; దితియున్ సంతాపమునొందె పెన్
శ్రమ యిట్లాయెనటంచు వెండి పలికెన్ సమ్మిశ్రుతో నిట్టులన్ 97

ఆ.వె. ఏడుముక్కలయ్యె నీగర్భపిండమ్ము
లేడులోకములకు నేడుగడయు
నై మరుత్తు లనుచు నైకమత్యముతోడ
నీదు సఖ్యమంది నిలువగలరు 98

ఆ.వె. దితికి సేవచేసె దేవేంద్రుడిచ్చోట
పుణ్యభూమియగుచు పొగడబడియె
ఇచట పురముకట్టె నిక్ష్వాకుపుత్రుండు
వానిపేరనిద్ది వరలుచుండె 99

తే.గీ. ఘనువిశాలుగోత్రమునందుజనహితులగు
రాజముఖ్యులెందరొ యొప్పి రాజ్యమేల
వారలను సోమదత్తుడు పరమవిభుడు
నతనిపుత్రుండు కాకుత్స్థుడమర సన్ని
భుండు వానిసంతుసుమతి భూవిభుండు 100

 మ. వనముల్ దాటుచుమౌనులం గలిసి విశ్వామిత్రుడేతెంచెనం
చని భూపాలుడు మిత్రబంధుతతితో నాప్యాయతల్జూపుచున్
వినయమ్మొప్పగ స్వాగతించెమునియున్ పృధ్వీశు క్షేమమ్ములె
ల్లను ప్రశ్నించెను మంత్రతంత్రవిధులన్ రాణించు పల్ నేర్పులన్ 101

మ. ఎవరీ సింగపుకూనలయ్యె స్థిరమౌ దృక్పాళి విస్తారమౌ
స్తవనీయమ్మగు వక్షముల్ కరములన్ చాపంపుటాపోపముల్
పవితుల్యంపు కృపాణ ధారులగుచున్ భాసిల్లు నిబ్బాలకుల్
వివరమ్ముల్ తెలుపంగ గోరెదనహో! విశ్వజ్ఞ! మౌనీశ్వరా! 102

ఉ. యజ్ఞము చేయు పంక్తిరథు డందు ఫలంబుగ వేదధర్మ స
ర్వజ్ఞుల పుత్రులన్ బడసిపాలన చేయుట, వారు స్వీయమౌ
యజ్ఞము రక్షసేయుట తదాదిగ మొత్తము కౌశికుండు నా
విజ్ఞున కంతచెప్పె పురివిప్పిన కూరిమి తోడనంతటన్ 103

తే.గీ. సుమతిభూపతి రాఘవ సోదరులకు
అర్ఘ్యపాద్యాదులర్పించి యాదరించె
మునులనెల్లర విడిదుల నునుచి వారి
పొద్దుపొడవంగ మిథిలకు పుచ్చెనంత. 104

## అహల్యావృత్తాంతము

ఉ. అట్టుల వారుసాగుచు మహాటవి మధ్యను సుందరమ్మునౌ
కట్టడమొందు గాంచి రది క్రమమునౌచును బాడుపడ్డదై
బెట్టిదమైన గుల్మముల పెంపువహించియు ధూళిమగ్నమై
చిట్టడవట్లు దోచె చిరుజీవుల కెల్లడ నాటపట్టునై. 105

చం. బహురమణీయమైన వనవాటిక యియ్యది నేడు జీర్ణమై
గహనమునౌచు దోచె మునికాంతుడు పూజ్యుడు నెవ్వరుండెనో
సహచరపుత్రశిష్యగణ సంస్తుతులందుచు మిక్కుటమ్ములై
న హవము లెన్ని చేసెకద! నా కొరకా చరితమ్ము చెప్పరే 106

ఆ.వె. అనుచు రాఘవుండు వినయముట్టిపడగ
గాధిసూను నడుగ, కనులనీటి
జీర తుడిచి కొనుచు శిధిలమౌ మునివాటి
గాంచి పలికె నిటుల కౌశికుండు 107

మ. అనఘా!యియ్యది నిత్యకర్మ రతుడౌ యగ్నిస్వరూపుండునౌ
ధనకామాదుల నొల్లనట్టి యతియౌ ధర్మజ్ఞుడౌ పూజ్యుడౌ
ఘనుడౌ గౌతమసంయమీంద్రు గృహమౌ గాసిల్లె శాపంబుచే
క్షణమాత్రంబున తల్లక్రిందులగు సూ కాలమ్ము వక్రించుచోన్ 108

చం. యమనియమంబులన్ నిలిచి యాజ్ఞిక జీవనులౌచునొప్పు సం
యములకు సత్యవాక్కులకు నాగమ రూపుల కెట్టులీగతుల్
గమనములయ్యెగాని ముని గౌతము జీవనమెల్ల ఛిద్రమై
విమలత లేది నేలబడు పీఠము నయ్యెను దైవలీలచేన్. 109

ఉ. అట్టి మహానుభావులకు నంతటి కష్టము లెట్లుగల్గె కన్
గుట్టిన కాలమే గతులగూర్చె? విచిత్రము వీరిగాథ లిం
కెట్టుల సాగెనో? వినగ నిచ్ఛ జనించెను బుద్ధి గాన నా
ఘట్టములెల్ల తెల్పుడనఘా! యని రాఘవుడాడె నమ్రుడై. 110

ఉ. భార్య యహల్యతోడ మునివంద్యుడు యజ్ఞ జపాది హోమ సత్
కార్యము లెన్నొ చేసి బహుకాలము నీమునివాటి నొప్పుచో
నార్యులు పూజ్యులౌ మునులు యాజ్ఞిక కర్మల నాచరింప న
ధ్వర్యులు నౌచు వత్తురిది వాటిక తొల్లిటి వైభవమ్ము నౌ. 111

ఉ. వేకువ వెల్గురేఖ లుడువీథుల త్రెళ్ళక మున్న లోకమున్
చీకటి వీడకున్న పలుశీతలగాలులు వేచుచున్న నే
వాకిటనో యరణ్య కృకవాకువుకూయక మున్న నేటి క
వ్యాకుల చిత్తుడౌ ముని రయమ్మున సాగెను కర్మబద్ధుడై. 112

ఉ. గౌతముడట్టు లేటికయి గ్రచ్చర సాగెడి యట్టి వేళ నా
గౌతమమౌని వేషమున కంథరవైరి యహల్యజేరి యో
నాతుక! మోహనమ్ము రమణమ్మగు నీ సుకుమార రూపమున్
నా తలపున్ రమించునిట నాదగు ధ్యాసయు నిన్నుచేరెడిన్. 113

మ. ఋతుకాలమ్మునకై నిరీక్షగొనరే శృంగారులౌ యౌవనుల్
జతవై కూడగ రమ్మటంచు పలుకన్ సాధ్వీలలామంబు త
ద్గత మోసమ్ము నెరింగి వచ్చినది దిక్పాలుండు దేవేంద్రుడీ
గతి సంశోధన చేయుచుండెనని నా కంజాక్షి భావించియున్. 114

ఉ. మెత్తని పూలబాటల గమించెను నాదగు జీవితమ్ము నా
చిత్తము తృప్తిమై పరవశించెను నీదగు గౌరవమ్ము కీ
వృత్తి కళంకమౌ ననుచు వేదన చెంది యహల్య హస్తముల్
హత్తి నమస్కరించె వినయమ్మున వజ్రికి దారిచూపుచున్. 115

చం. సురపతి నవ్వి యో సుగుణ సుందరి నీదు విశిష్టరీతికిన్
మురిసితి కార్యమాయె నిట పోయెద వచ్చినదారివెంట నం
చురుగతి నాశ్రమంబునట నొప్పుగ వీడుచువచ్చునట్టి యా
తరుణమునంద గౌతముడు ధర్మవరిష్ఠుడు వచ్చె జెచ్చెరన్. 116

చం. విమల జలంబులన్ మునిగి వేద జగమ్ముల నోలలాడుచున్
సమిధలు, దర్భలంగొనుచు సాత్విక మూర్తియు బ్రహ్మతేజు డా
శ్రమమును జేరెనంత తనసమ్ముఖమున్ దనరూపునొప్పు సం
యముగని తత్క్షణమ్మున సురాధిపు చెయ్దులెరింగి క్రుద్ధుడై 117

మ. కనులన్ నెత్తురు లుప్పతిల్ల బలువౌ కంఠంబు రుద్ధమ్మునై
అనలమ్మట్టుల తీక్ష్ణకాంతియుతుడై యక్షీణ పారుష్యమున్
గనుచో నాదగు రూపమున్ గొనుచు దుష్కార్యంబు గైకొంటి వీ
క్షణమే, ముష్కము రాలు గాక యనుచున్ శాపించె నాదివ్యునిన్ 118

ఆ.వె. ఆ క్షణమ్ము నంద నసురారిముష్కమ్ము
లంత నేలద్రెళ్ళె, నండహీను
డైన యమరవిభుడు దీనవదనుడౌచు
దెలిపె వివరమంత దివికి నేగి. 119

ఆ.వె. గోడ గరచియున్న కుడ్యమత్యమువోలె
అడరుచున్న నా యహల్యజూచి
క్రోధసంధిలోన కొట్లాడుచున్నట్టి
కఠినుడౌచు పలికె గౌతముండు 120

మ. పలువేలేండులు వాయుభక్షణముతో వాసింతువిచ్చోట ని
శ్చలవై నిల్చి యదృశ్యవౌచు వగతో సంక్లిష్ట చిత్తంబుతో
జలముల్ భోజన మేమిలేక తమిలో సౌభాగ్య హీనమ్మవై
కలికీ! నిల్వుము భస్మశాయివగుచున్ కాలమ్ము చేకూరుచోన్ 121

ఉ. ఒక్కదినమ్ము రాముడు మహోన్నత సత్త్వుడు రాఘవుండు నీ
ప్రక్కకు వచ్చి ఘోర వనవాటిక జొచ్చును శాపమోక్షమున్
దక్కి పవిత్రవౌదు శుభదాతకు సత్కృతులెల్ల చేయుచో
మక్కిల లోభమోహములు మన్నన లందెదు నాదుభార్యవై 122

తే.గీ. అట్లు క్రోధమున శపించి యాశ్రమమ్ము
వీడి గౌతమసంయమి వెడలెనంత
సిద్ధచారణ గంధర్వ సేవితంబు
మంచుకొండకు తపములు మరలచేయ 123

మ. ఘనుడౌ గౌతమసంయమీంద్రు తపమున్ కారించు వ్యూహమ్మునన్
ముని శాపంబున ముష్కముల్ తెగియె సంపూర్ణుండునై నొప్పగా
కనరే మార్గమటంచు దేవతలకున్ కైమోడ్చె పాకారి వా
రును మేషాండములన్ దగిల్చిరపుడున్ లోకమ్ములోహోయనన్. 124

ఉ. ఓరఘు వంశ వీర! సుగుణోన్నత! భాసిత సూర్యతేజ! యీ
చేరువ నొప్పుగౌతముని జీర్ణ కుటీరము నీదు రాకకై
కూరిమి తోడచూచు నడుగుల్ వడిమోపి తరింపజేయుమీ
యా రమణిన్ సుసాధ్విని నహల్య నటంచును మౌనిపల్కుచోన్ 125

తే.గీ. గాధిసుతుని యాజ్ఞ గౌతము వాటికి
అనుజుతోడచొచ్చె నినకులుండు
కఠిన దీక్షతోడ కాంతిశరీరాన
అతివదోచె నాయహల్యయపుడు 126

సీ. హోమగుండములోన ధూమంపుసుడిలోన
కనుదోచు జ్వాలనా గలికిదోచు
పెనుమంచు తెరలలో వికసించుశీతాంశు
రేఖనా కన్పట్టు లేమయంత
మున్నీటి మడుగులో మునిసిరినజిగియట్లు
భాసిల్లు నచ్చోట భామ యొర్తు
అపురూపమైనట్టి యందాల బొమ్మనా
నవ్యక్త రూపమ్ము నచటదోచు
తే.గీ. ద్రష్ట రమణీయసృష్టియై ధరణి నొప్పు
నా యహల్య గౌతముని మహాతపమ్ము
కతన దృగ్గోచరయుగాక గడిపెనిట్లు
రాముడరుదేర నచ్చోట రామదోచె. 127

మ. వినయమ్మొప్పనహల్యపాదములకున్ వే మ్రొక్కిరారాఘువుల్
మునిమాటల్ తలదాల్చియామె రఘురాట్ పూజ్యుండు రామయ్యకున్
ఘనమౌ స్వాగత మాచరించి బహుసత్ కారమ్ములన్చేసె నా
మునియున్ రాముని రాకతెల్సి త్రుటిలో పుణ్యాంగనన్ జేరుచున్ 128

ఆ.వె. గాధిసుతునితోడ కౌసల్యసుతులకు
అతిథి సత్కృతమ్ములన్నిచేసె
సతి యహల్యతోడ సన్ముని గౌతము
డంత వారి మిథిలకపుడు పుచ్చె 129

## మిథిలానగర ప్రవేశము

ఆ.వె .గాధిసూనుగూడి కౌసల్య తనయుండు
మునులువెంటనంట జనుచునుండె
జనకవిభుడుచేయు జన్నంబుచూడంగ
మిథిలనగరికొరకు మేలుకలుగ 130

చం. జనక మహీధవుండు నట జన్నపు వాటికి వచ్చు గాధిసూ
ముని గని యర్ఘ్యపాద్యముల న్యూనత లేక యొసంగి నమ్రుడై
మునిజనమాన్య!నీ హవ మపూర్వ ఫలంబులనిచ్చెనేడు మీ
ఘనమగు రాకచేసి శుభకారక చిహ్నము లివ్వియేసుమీ 131

మ. ధనువున్ జేగొని రాచరీవులొలకన్ తారుణ్యసంపన్నులై
రణపాండిత్యపు తీరుతెన్నులెసగన్ రమ్యంపు రాణ్మూర్తులై
ఘనులౌధీరులు కాకపక్షధరులౌ గంభీరులౌ వారలా
వనముల్ దాటుచు వచ్చినారలనఘా వారెవ్వరో తెల్పరే 132

కం. అని జనకుడు ముని నడుగగ
కనుకొన లినకుల తిలకుని గని ముదమున నా
ముని పతి దశరథ జనపతి
తనయులనుచు దెలియపరిచె తరుగని మమతన్ 133

మ. స్తవనీయుల్ రఘువంశ దీపకులు నా జన్నంబు రక్షింప నీ
దవమున్ జొచ్చి విశాలరాజ్యవిభునిన్ దర్శించి జీర్ణమ్మునై
భువిజీరాడెడి గౌతమాశ్రమ గతుల్ పూజ్యంబుగా మార్చి మీ
శివకోదండము చూడవచ్చిరిసుమీ సిద్ధించు నీ కాంక్షలున్ 134

తే.గీ. గౌతమ జ్యేష్ఠ పుత్రుండు కర్మవిదుడు
జనక విభు పురోహితుడును సకలశాస్త్ర
వేత్తయగు శతానందుడు విస్మయమ్ము
తోడ రాఘవు వీక్షించి దోయిలించె 135

చం. ఇనకుల వంశభూరమణు డిష్టి సురక్షకు డాదిదేవుడై
మణిమయ తేజుడై పదము మా వన వాటిని నిల్పి శీర్ణమై
తృణమయమైనదాని ద్యుతి దీర్చెనె తొల్లి తెరంగుఁదల్లి వా
నిని గని యర్ఘ్యపాద్యముల నిష్ఠనొసంగుచు గారవించెనో 136

చం. జనకుడు గౌతముండు నట సాధ్వి నహల్యను స్వీకరించెనా?
జనని గతంపు దుర్ఘటనసాగు విధమ్మె రుగంగచెప్పిరో
జనకుని పూజలన్ విభుడు సౌమ్యుడు నౌచును స్వీకరించెనో
మునిజనమాన్య యా వివరముల్ తలుపంగదె తెప్పరిల్లగన్ 137

తే.గీ. అని శతానందు డడుగగ మునివర విను
నాదుకర్తవ్యమీడేర్చినాడ నచట
రేణుకనుగొన్న జమదగ్ని రీతి సతిని
గౌతముడుగొనె ననితెల్పె గాధి సుతుడు 138

## విశ్వామిత్రుని సంపూర్ణ చరిత్ర

తే.గీ. గౌతమజ్యేష్ఠపుత్రుడు గాధిసుతుని
గూర్చి శ్రీరామచంద్రుని గూడిపలికె
పరులకుపకారమొనరించు వ్రతముగల్గు
ఘనుడునిత్యమ్ముబ్రహ్మర్షిగాధిసుతుడు 139

ఉ. జన్మపువ్యాజమున్ ఘనుని శ్యామలవర్ణుని రాజభోగ సం
పన్ను నరణ్యమార్గముల మా వన వాటికి గూర్చి శాప సం
క్లిన్న కహల్యకున్ మరల కీర్తి నొసంగుట మేలుగాదొకో
పన్నగ ముఖ్యుడైన మునిబాంధవు గాథ వచింప సాధ్యమా? 140

చం. పరహితకారి,జ్ఞానమయవార్ధి తపోధనవంతు డార్షుడౌ
సురముని వందితుండు మునిసోముడు గాధిసుతుండు క్షాత్రమున్
ధరణి జయించి యేలె బహు ధార్మికు డౌచును వానిగాథలన్
స్థిరమతివౌచు గైకొనుము శ్రీ రఘు రామ వచింతు నన్నియున్ 141

తే.గీ. ధర ప్రజాపతి పుత్రుడు ధార్మికుండు
కుశుడు, కుశనాభు డాతని కూర్మిసుతుడు
గాధి యాతని తనయుడా గాధిసుతుడు
నార్షవిభుడు విశ్వామిత్రుడందురతని 142

మ. క్షణకాలమ్మున క్షాత్రధర్మరతుడై సర్వంసహాచక్రమున్
వనధిన్ ముంచగశక్తుడౌ క్షణములో స్వర్గమ్ము నీభూమిపై
కొనితేగల్గెడి ధర్మసత్వచణుడౌ క్షోణీస్థలిన్ వీని పై
కొను రాజేంద్రులు లేరులేరనుచు నుద్ఘోషించు నీలోకముల్ 143

మ. చతురంగమ్ములు సేనలున్ గదలగా శస్త్రాస్త్రపారంగుడౌ
క్షితినాధుండగు గాధిసూతి రిపులన్ చెండాడి క్ష్మాజేతయై
అతిగర్వమ్మున సాగుచున్ విపినమం దాశ్చర్యమౌ స్నేహసం
గతులన్ గాంచి తపోవనమ్మనుచు సత్కార్యంపుసంబద్ధుడై 144

సీ. వత్సమ్ములంగూడి పాలధారలగ్రోలు
శార్దూలమత్తేభ శాబకములు
కోకిల కూతల కూడినాట్యముచేయు
నాగవారికములు నాగములును
ఆలమందలతోడ హరిణాలతోడుత
చిరుతలు సింహాలు చెలిమిచేయు
పండిరాలినపండ్లె పక్వాన్నతుల్యమై
పుడమిజీవులకెల్ల కడుపునింప

తే.గీ. సమరభావమ్ము లేనట్టి శాంతభూమి
శాంతి మమతల నెలవైన సత్వభూమి
సత్త్వకర్మల విలసిల్లు తత్వభూమి
తత్వదీపాలకాంతియౌ తపసిభూమి 145

ఉ. రాలిన పర్ణముల్దినుచు రాలిన పండ్లను స్వీకరించుచున్
గాలిని పీల్చుకొంచు తరుకాండములానుచు తల్లక్రిందులై
తూలెడి కాళ్ళపైనిలిచి తోరపుటెండల జీర్ణదేహులై
వేలయుగమ్ములన్ తపము పేర్మినొనర్చెడి వారలెందరో 146

ఉ. వేదము వల్లెవేయు గురుపీఠము లొక్కెడ శాస్త్రసారముల్
వాదముచేయు పండితుల వాటిక లొక్కెడ యజ్ఞగుండపున్
వేదిక లొక్కచోట నయి వేవురు చాత్రులతోడ నొప్పె నా
వైదికుడే వశిష్ఠుడట బాధమునౌ నియమాల దోగుచున్ 147

మ. నయవినయమ్ములన్ దొణుక నవ్య మనోహర రత్నహారముల్
కయిగొని కాన్కజేసి ముని కాళ్ళకు మ్రొక్కెను గాధిసూతి ధీ
మయుడు వశిష్ఠుడంత తగుమన్నన జేయుచు సత్కరించి ది
గ్జయునకు నంత నర్ఘ్యమిడె శాస్త్రవిధిన్ గుశలమ్ము లాడుచున్ 148

ఉ. దవ్వులనుండి వచ్చికడుడస్సిరి మీకిట విందు చేయగా
ఉవ్విళులూరె చిత్తము మహోన్నత సత్వ ససైన్యశక్తి మా
బువ్వలు స్వీకరించి బహుపుణ్యము గూర్చుడు కామధేనువీ
నెవ్వగతీర్ప మమ్ముకరుణించునటంచును మౌనిపల్కుచోన్ 149

తే.గీ. ఆ వసిష్ఠుడు సంకల్పమట్లుచేయ
కామధేనువు వర్షించె కామితమ్ము
లైన వంటకముల నెల్ల నా క్షణమున
సురులు నాశ్చర్యచకితులై చూచుచుండ 150

సీ. క్షీరాన్నపాత్రలు చిత్రాన్నరాశులు
దధ్యోదనమ్ముల దబ్బురలను
బూరెలు గారెలు బొబ్బట్లు కాజాలు
సున్నుండలరిసెలు జున్ను మిగుల
పప్పులు పులుసులు పచ్చళ్ళు చారులు
పెరుగులు నేతులు విరివియౌచు
మకరందతుల్యమౌ మాకందఫలములు
కదళీఫలమ్ముల గరిసెలొప్ప
తే.గీ. ఏరికిష్టమ్ము లెవ్వి యవ్వారికటుల
కొసరి వడ్డించి పెట్టిరి విసువులేక
ధేనువిడినట్టి యన్నమ్ము తృప్తి మీర
రుచులబొగిడిరిసైనిక లోకమెల్ల 151

చం. ఇట నటవీస్థలిన్ మొదవ దెట్టుల నింతటివిందుగూర్చె? ము
చ్చటనగు చుండె దానిగొని సౌఖ్యము లందుట రాజధర్మమం
చటముని జేరి కౌశికు డహో ముని సత్తమ! దివ్యభోజనం
బిటనిడి తృప్తిగూర్చితిరభీష్టము దీర్చుడు మాకునిప్పుడున్ 152

మ. ఘనమౌ రత్నము కామధేనువది కీకారణ్యమధ్యమ్మునన్
పనియేలేక చరించుచుండెను గదా పాలింప మావీటికిన్
గొనిపోగోరితి భూమినొప్పు విలువౌ గోమేధికాదుల్మణుల్
ఘనునిన్ క్ష్మాపతి సొత్తునౌ ధరణిలో కాదందురా సన్మునీ! 153

తే.గీ. క్షీరధారలు వర్షింప చేవకలుగి
సర్వశుభలక్షణమ్ముల సాగువాని
లక్ష గోవుల మీకిత్తు నీక్షణమ్ము
కామధేనువు నాకిమ్ము కాన్కయనుచు 154

ม. అనినన్ మౌనియునవ్వి యోక్షితిపతీ! యత్యాశయౌనిద్ది మా
మునివాటిన్ గల హోమధేనువును వ్యామోహమ్ముతోకోరెదో
ధనమానమ్ములు రక్షసేయ క్రతువుల్ దానాది కార్యంబులున్
వనమున్ జేయగ నాటపట్టు నిదిమా ప్రాణంబు నెట్లిచ్చెదన్ 155

సీ. స్వచ్ఛాశ్వములపూన్చు స్వర్ణరథమ్ములు
నెన్మిది వందల నెలమినిత్తు
కాంభోజదేశంపు ఘనమగు గుర్రాలు
పదునొకండునువేలు వరుసనిత్తు
చిత్రవర్ణములౌచు క్షీరధారలగూర్చు
కోటియావులమంద కోరియిత్తు
స్వర్ణాంబరములిత్తు పైడిహారములిత్తు
రత్నాలముత్యాల రాసులిత్తు
తే.గీ. రాజ్యభాగమ్ము మీకిత్తు రాజుచేయ
ఏదికోరిన నద్దాని నిత్తుమీకు
కామధేనువు నొసగుడో స్వామియనుచు
నంత గాధేయుడనియె మహర్షితోడ 156

మ. ఘనమంత్రమ్ముల సారమైస్వరమునై గవ్యంబునై ధ్యానమై
మునిభాగ్యమ్మయి శాంతిమంత్రమయి సన్మోక్షంపుసంధాయియై
గుణమై దేవగణమ్మునై ధనమునై గోతత్త్వమై నొప్పు జీ
వనమౌ ధేనువు నీయలేను క్షితిపా భాగ్యమ్ములేమిచ్చినన్ 157

తే.గీ. అని వసిష్ఠుడు తన నిర్ణయమ్ము తెలుప
ఫాలభాగాన స్వేదమ్ము ప్రాకుచుండ
ఎగయ రోషమ్ము కన్నులునెర్రవార
గౌరవాసనమును డిగ్గె గాధి సుతుడు 158

చం. క్షితిపతి సైగలన్ గొనుచు శిక్షిత సైనిక తండమెల్ల ను
ద్ధతిదృఢ రజ్జువున్గొనుచు ధైర్యము తోడ సవిత్రి బట్టి వా
రతిరయమున్ గమింప మొదవంతటట వారి విదిల్చి కొట్టి యా
యతి మునివాకిటన్ నిలచె నార్తిగ నర్చుచు బేలచూపులన్ 159

ఉ. వారు ధరాధినాయకు లవారిత శక్తులు సర్వసైన్య సం
భారులు ధైర్యసాహసులు వారి నెదుర్కొన లేని ధర్మ సం
చారులమమ్మరో! యఖిల శక్తివి నీవు సమస్తజీవనా
ధారవు క్షుద్రసైనికుల ధాటికి లొంగుట లెంతచిత్రమో 160

మ. అనుచున్ మౌని వసిష్ఠుడాడ మొద వంబాయంచు దీర్ఘంపు ని
స్వనమున్ జేయుచు నేలదువ్వి కినుకన్ సైన్యంబు సృష్టించె స
ద్రణపాండిత్యుల శూరులన్ క్షణములో శస్త్రాస్త్ర సంపన్నులై
మొనలో దూకిరివారు, రాజబలముల్ పోకార్చనత్యుగ్రులై 161

సీ. మంత్రపూతమ్ములౌ మారణాయుధముల
రిపుసేనపై చెలరేగువారు
డాల్ కత్తులను బట్టి ధైర్యసాహసముల
మొగ్గరమ్మునజొచ్చి పుచ్చువారు
వేదండములనెక్కికోదండములుదాల్చి
శత్రుసేనల వడి చంపువారు
శూలమ్ములన్ ద్రిప్పి కాలుబంటులయట్లు
పరసేన ప్రాణాలు పట్టువారు

తే.గీ. భీకరాకారులై శత్రుపీచమణిచి
రెండు సేనలు పీనుగు పెంటలయ్యె
చావమిగిలిన వారలు చేవతరిగి
కొండకోనల జొచ్చిరి యండలేక 162

తే.గీ. కౌశికుని నూర్వురు సుతులు కలతనొంది
ముని వసిష్ఠుని పరిమార్చ ముందుకురక
హుంకరించె వసిష్ఠుడు నుగ్రుడగుచు
దాన వారలు ద్రెళ్ళిరి సేనతోడ 163

చం. బలగము త్రెళ్ళ పుత్ర పరివారము నాశమునొంద గర్వముల్
పొలయగ రెక్కలున్ దెగిన పుల్గు గతిన్ ధర గూలి రాజ్యమున్
బలములనేలఁ బుత్రునకు పట్టముకట్టి విరాగియౌచు తా
చలిమల కేగె కౌశికుడు సాంబుని గూర్చి తపమ్ము జేయగన్ 164

ఆ.వె. మంచుకొండపైన మదనారి కై రాజు
ఘోర తపము చేయ కోకనదుడు
మెచ్చి వరము నొసగ వచ్చితి కోరుకొ
మ్మనగ గాధి సుతుడు ననియెనిట్లు 165

మ. కరుణా సాగర! భక్తలోక సులభా! గాధేయునిన్ మెచ్చి స
ద్వర సంపత్తులు గూర్చుచో, నుపనిషత్సారంబు నిప్పింపుమీ
ధరలో నొప్పెడి యస్త్రశస్త్ర రణవిద్యా పాటవంబెల్ల నా
పరమున్ జేయుమటంచు కౌశికుడు సద్భక్తిన్ నివేదించుచోన్ 166

ఆ.వె. వల్లెయనుచు శివుడు వరములనీయంగ
యక్ష దేవ మనుజ రాక్షసాది
యుద్ధ విద్యలన్ని బుద్ధిని కుదరంగ
గర్వి యగుచు నుబ్బె గాధి సుతుడు 167

మ. వరగర్వమ్మున రేగి కౌశికుడు తా వాశిష్ఠ మన్యంబుకై
శరవేగమ్మున నేగి శస్త్రతతిచే సంక్షోభమున్ గూర్చుచో
పరుగుల్ వెట్టిరి తాపసుల్ వటువులున్ ప్రాణాలు చేపట్టి య
త్తరి సత్త్వమ్మగు బ్రహ్మదండమును చే దాల్చెన్ వశిష్ఠుండు తాన్ 168

శా. దివ్యంబుల్ ఘన మంత్రతంత్ర మయముల్ దేదీప్యమానంబులౌ
నవ్యాస్త్రంబుల నెన్నియేని విడువన్ నాశమ్మునౌనన్నియున్
భవ్యంబౌ ముని బ్రహ్మదండమహిమన్ బ్రహ్మాస్త్రమున్ గొంచు నీ
దివ్యాస్త్రంబున చత్తువీవనుచు సంధించెన్ ధరాకాంతుడున్ 169

తే.గీ. కాంతిమయమైన దండమ్ము గదియునంత
దివ్యబ్రహ్మాస్త్ర పాళి నిస్తేజమయ్యె
విల్లు నేలపై విసరుచు వెడలెనంత
మ్లాన ముఖుడైన కౌశిక రాజవరుడు 170

మ. ధరలో క్షత్రియ తేజమేమి బలమౌ దర్పంబు వ్యర్థంబునౌ
వరసద్బ్రాహ్మణ తేజమే బలము నౌ బ్రహ్మాండ భాండాన భీ
కర దివ్యాస్త్రసమూహమున్ క్షణములో ఖండించె దండంబు దె
ప్పరమౌ రోషము వీడి దీర్ఘతపమున్ బ్రహ్మత్వమున్ పొందెదన్ 171

తే.గీ. అనుచు కౌశికుండు మనమున దలచుచు
దారగూడి నిష్ఠ తపముచేసె
వేయివర్షములకు వేల్పులతోగూడి
బ్రహ్మ యెదుటదోచి పలికెనిటుల 172

తే.గీ. నిష్ఠ తోడుత నొనరించు నీతపమ్ము
తృప్తి గూర్చె రాజర్షివై వృద్ధినందు
మనుచు పరమేష్ఠి దీవించి యరిగెనంత
కలత చెందెను ఖిన్నుడై గాధి సుతుడు 173

తే.గీ. నా కఠినమౌతపమ్ము నన్యాయమాయె
నఖిల లోకాలు రాజర్షి ననియె నన్ను
ఘోరతపమున నాకోర్కె తీరవలయు
ననుచుతపముగూరెను గాధితనయుడంత 174

## షష్ఠ్యంతాలు

ఖరదూషణాది యసురుల
పరలోకము పుచ్చినట్టి వరవీరునకున్
పరమేశ్వర కోదండము
పరువముగా పైకినెత్తు జానకి పతికిన్ 1

నీరజ పత్రనేత్రునకు నీరదగాత్రున కాదిమూర్తికిన్
వారిజ నేత్ర సీతకయి వారధి కట్టిన పౌరుషాగ్నికిన్
వారిశు చాపమున్ గొనుచుభార్గవు నొంచిన క్షాత్రకీర్తికిన్
ధారుణి ధర్మమూర్తికిని తర్ష కులాంబుధి చంద్రరేఖకున్ 2

పాదధూళిచేసి పడతి యహల్యకు
మోక్షమిచ్చినట్టి పుణ్యమతికి
గరిక తునుక చేసి కాకాసురునకును
పొగరు తీర్చినట్టి బుద్ధిమతికి 3

ఆశ్వాసాంతగద్య
ఇది శ్రీకౌండిన్యస గోత్రోద్భవుండు ఉపాధ్యాయుల వంశరాకాసుధాకరుండు
సూర్య కాంత నారాయణ మూర్తి దంపతుల
అష్టమగర్భుండు మధురకవి బిరుదాంకితుడు
నగు గౌరీశంకరునిచే రచింపబడిన శ్రీరామ
కథామకరందము బాలకాండమునందు
తృతీయాశ్వాసము సర్వము సంపూర్ణము.

**–శుభమ్–**

# శ్రీరామ కథామకరందము

## *బాలకాండము*

## చతుర్థాశ్వాసము

**శ్రీ** వనితార్చితపాదా!
పావన గంగాప్రవాహ వర్ధిత పాదా!
కైవల్యాస్పద పాదా!
పావని పరిపాలపాద! భామయపాదా!

### త్రిశంకు చరితము

మ. ధర నైక్ష్వాకుడునౌ త్రిశంకుడు ధరాధ్యక్షుండు ధర్మజ్ఞుడై
అరులన్ ద్రొక్కుచు సత్యవాక్యచణుడై యాగమ్ములన్ చేయుచున్
గురుపాదమ్ముల నాశ్రయించి స్థిరుడై కోపమ్ము వర్జించి తా
పరిపాలించుచు నుండె భూస్థలిని నా పాకారి భోగమ్మునన్ 1

మ. సశరీరమ్ముగ స్వర్గమున్ గదియగా సంకల్పమొక్కండు లో
నిశియై పుట్టెను వాంఛయున్ బెరుగ దానిన్ దెల్పగా నంతయున్
విశదమ్మైన వసిష్ఠుడంత పలికెన్ విశ్వాన సాధ్యమ్ము కా
దిసుమంతైన త్యజించుదీనినిపుడే యిక్ష్వాక శాంతింపుమీ. 2

తే.గీ. అని వసిష్ఠుడు వివరించి యరిగె గాని
రాజు చిత్తాన కాంక్షాగ్ని రాజుచుండె
ఘనులు గురుపుత్రులన్ గూడికాంక్షతెలిపి
జన్నమొక్కండుచేయంగ విన్నవించె 3

మ. వరవిద్యా వినయంపు ధీచణులునై భాస్వత్ప్రభామూర్తులౌ
గురుపుత్రుల్ క్షితి మీరు జన్నమొకటన్ గుర్తించి నన్ బొందితో
ఉరు స్వర్గంబున నుంచుడయ్యదయతో నుత్సాహమేపార నా
చిరు సంకల్పమసాధ్యమంచనక యక్షీణంపు కారుణ్యమున్ 4

మ. గురువాక్యమ్ముల ధిక్కరించి యిట సంకోచమ్ములన్ వీడి యీ
కరణిన్ ప్రేలెదవేమి? యాగమదియా కాదద్ది యజ్ఞాని నే
ర్పరియౌ మాపితృపాదువాక్యముల మీరన్నేర మేమెయ్యడన్
మొరకుండట్టుల కోరెదేల ప్రభు! సంపూజ్యుండవై యొప్పుమీ. 5

చం. అనిగురుపుత్రులున్ బలుక నట్టుల గాక శుభంబు మీకగున్
మనసును తీర్చికొందు గురుమాన్యుల వేరొక యాశ్రయాన యం
చును పతి విన్నవింప గురు సూనులు క్రోధ నిపీడ్యమానులై
జనవర! పుల్కసుండవయి సాగుమ టంచును శాపమిచ్చుచోన్ 6

ఉ. నల్లని వస్త్రముల్ గలిగి నల్లని పూసల దండలొప్పగా
నల్లని మేనిరంగు వదనమ్మున మోటుతనమ్ముతోడ రా
జిల్లెడి రక్తనేత్రముల క్షేత్ర విభుండు మనంబునందు శో
కిల్లుచు నొప్పెనాక్షణము కిమ్మన కుండగ శాపదగ్ధుడై 7

శా. విశ్వం బందు వశిష్ఠువైరి గలడో విఖ్యాతుడౌ మౌని నా
విశ్వఖ్యాతుని వేడికొన్న తనదౌ పేరాసతీరుంగదా
ఆస్వామిన్ దగనాశ్రయింతునని లో నాస్వాశమున్బొంది వే
విశ్వామిత్రుని కంతయున్ దెలిపె నావేగాన నైక్ష్వాకుడున్ 8

శా. నీదౌ కోరిక తీరు నావలననే నిశ్చింత నొప్పారుమీ
వేదార్థంబు నెరుంగు యాజ్ఞికులతో పేరొందు జన్నమ్ము సం
మ్మోదమ్మున్ దగకూర్ప చేసెదనహో పూర్వంబు వేరెవ్వరే
వేదంబున్ గనరానిదాని ఫలముల్ విఖ్యాతమై యొప్పగన్ 9

చం. తనయుల ఛాత్రులన్ బిలిచి తద్ఘన యాగము నిర్వహింప స
న్మునులను స్వాగతింపుమని పుచ్చెను మౌనులు గాధిసూతికిన్
వణుకుచు యజ్ఞకార్యముల పాల్గొని రంత వశిష్ఠసూనులా
ఘనమఖమున్ త్యజింప ముని కౌశికు డంత శపించె వారలన్ 10

ఉ. యాగము సాగుచున్నయది యాజ్యపు ధారల వీతిహోత్రుడున్
రేగెను నింగితాక నట బుక్కులు దిక్కుల పిక్కటిల్లె నా
యాగపు భాగముల్ గొనగ నగ్నిముఖుల్ గనరారు క్రోధమున్
దోగుచు గాధిసూతి బహుదుష్కరమౌ తపమెల్ల నిచ్చుచోన్ 11

ఆ.వె. తనువుతోడ స్వర్గధామమ్ము చేరక
నృపతి యట్లె ధరణి నిలచియుండ
తన తపఃఫలమ్ము ధారవోసెనుమౌని
దాన విభుడు నమరధామమందె 12

ఉ. వచ్చు త్రిశంకుగాంచి సురపాలుడు క్రిందికి గెంటివేయుచో
జెచ్చెర గావ క్ష్మావిభుడు జీరగ నూతన స్వర్గధామమున్
గ్రచ్చర సృష్టి జేసి నిడె కౌశికు డంత త్రిశంకు డందునన్
నిచ్చలు నంతరిక్షమున నిల్చె నథోముఖుడౌచు వ్రేలుచున్ 13

## శునశ్శేపుని వృత్తాంతము

తే.గీ. విఘ్నభూయిష్ఠమైన నవ్వీడువదిలి
పశ్చమంబున పుష్కర వాటికొరకు
తనయులందరు తోడరాన్ దరలివెళ్ళి
గాఢ తపమున గూరెను గాధిసుతుడు 14

తే.గీ. అంబరీషు డయోధ్యామహావిభుండు
ఇష్టి నొక్కడు చేయంగ నిచ్చగించె
యజ్ఞ పశువును గోత్రారి యపహరింప
పలికె రాజ పురోహిత వ్రాతమంత 15

ఆ.వె. యజ్ఞ పశువులేక యజ్ఞంబు జరుగదు
యజ్ఞమాగగూడ దవనిలోన
యజ్ఞమాగెనేని యజమాన మరణించు
యజ్ఞ పశువు గూర్చుడనఘ వేగ 16

చం. ధనము నొసంగి యైన శుభదమ్మగు ధేనువు లిచ్చియైన పల్
కనకమయమ్ములౌ నగలు కాన్క నొసంగుచు నైన రత్నముల్
మణులు నొసంగి యైన చిరుమానవు నైన గ్రహించుడయ్య వా
నిని బలి యిచ్చియీమఖము నిర్వహ ణమ్మొనరింపగావలెన్ 17

చం. నగరములందు పల్లెల వనమ్ముల జానపథమ్ములందు పెన్
నగముల యందు భూపతి ధనమ్ము నొసంగ లభించు వానికై
తగుగతి దేవులాడె ఫలితమ్ము లభింపదు భూపతీంద్రు డె
త్తగు భృగుతుంగ శృంగమున నద్భుత తేజు ఋచీకగాంచుచున్ 18

ఉ. మౌనికి వందనమ్ములిడి మన్న్య హయమ్మును దొంగలించుటల్
దాన మఖమ్ముకై బలి ప్రధానము చేయ సమర్థ రూపుడౌ
మానవు కోసమై నర సమాజము మొత్తము దేవులాడుటల్
దీనుడునౌచుచెప్పె పతి దివ్య ఋచీచు మహర్షి తోడుతన్ 19

తే.గీ. లక్ష గోవుల నీకిత్తు ప్రతి ఫలమ్ము
నిమ్ము చేయుము నీసుతు నిష్టికొరకు
అనుచు నంబరీషుడుపల్క నమ్మ నెపుడు
జ్యేష్ఠపుత్రుని యని మౌని చెప్పువేళ 20

చం. వినగు గాదె జ్యేష్ఠుడన ప్రీతియు దండ్రికి గల్గు నట్టులే
జనని కనిష్ఠుడన్న తెగ సంతస మందు కనిష్ఠుడైన నీ
శునకుని నీయజాలనని సొక్కుచు చెప్పెను మౌనిభార్యయున్
వినయము తోడ మధ్యముదు పెద్దరికమ్మున బల్కె నిట్టులన్ 21

తే.గీ. వాని నమ్మదుతండ్రియు వీనినమ్మ
లేదు తల్లియు నన్నిట వాదులేక
అమ్మినట్టుల దల్చెదు నరుగుడయ్య
వేల్మి వాటికి వేగమై వెంటవత్తు 22

తే.గీ. అని శునశ్శేపుడాడగ నవని ధవుడు
రథము నెక్కించి గొంపోవ రాజధాని
కొరకు పుష్కరవాటిని కొంత తడవు
రథము నిలిపిరి వేగ విశ్రాంతి నంద 23

ఉ. అవ్వన వాటి గాధి సుతు నాగమవేత్తను మౌనిపుత్రుడున్
దవ్వులనుండిచూచి యరదమ్మును డిగ్గి శరమ్మురీతినా
చివ్వన మౌనిపాదముల జేరుచు ప్రాణభయమ్ముదెల్పుచో
నెవ్వగదీర్చి రక్షనిడ నిర్ణయమున్ గొనె గాధిసూతియున్ 24

చం. కొడుకుల బిల్చియీవటువు కోరిన పిమ్మట ప్రాణభిక్ష నే
నిడితిని, గాన మీరలొక రీతని మారుగ నిష్టికేగుడీ
వడి నని యానతీయ పితృవాక్యము లొల్లరువారు, వారలన్
తడయక శాపవాక్యముల దగ్ధము చేసెను గాధి పుత్రుడున్ 25

తే.గీ. శునక మాంసంబు దినుచును శోకముననుచు
వేయి వర్షాలు బ్రతుకుడు వెరవుతోడ
ముష్టికాదులయి వశిష్ఠ పుత్రులటుల
ననుచు శపియించె కౌశికు డంగజులను 26

మ. ద్యుతిమంతమ్ములు నవ్యమంత్రయుతముల్ యుక్తమ్ములౌ రీతులన్
స్తుతులన్ నేను సృజించి యిత్తు క్రతువున్ సుశ్లోకులింద్రాదులన్
వ్రతివై పాడు మనస్సుతీరు ననుచన్ రమ్యమ్ములౌ స్తోత్రముల్
ప్రతిభావంతుడు గాధిసూతి నుడివెన్ బాలుండుపొంగారగన్ 27

తే.గీ. క్రతువుకయి శునశ్శేపుని రయమునగొని
అంబరీషు డయోధ్యకు నరుగుదేర
ఆఘమేఘాల యజ్ఞంబు సాగుచుండ
బలిపశువునౌచు బాలుడు బలిమినిలిచె 28

ఉ. రక్తపు గంధముల్ పులిమి రక్తపు వస్త్రములెల్లకట్టి పై
రక్తపు పూలమాలికలు గ్రాలగ వేసి యలంకరించి వి
ధ్యుక్తముతీర్ప యూపమున యుక్తిగ కట్టగ బాలకుండు వే
దోక్తపు మంత్రసూక్తముల నుచ్చగతిన్ పఠియించె నైంద్రముల్ 29

ఉ. అట్టుల గాధిసూతికృతమౌ నుతులన్ కదురమ్యధోరణిన్
బిట్టుగ బాలుడున్జదువ వేల్పులు తృప్తిని బొంది ఱేని క
ప్పట్టున పూర్ణయజ్ఞ ఫల భాగ్యము దీర్ఘ తపశ్చిరాయువుల్
చిట్టి మునీంద్రుసూనునకు శీఘ్రు మొసంగిరి భూమిమెచ్చగన్ 30

## మేనకావిశ్వామిత్రము

ఉ. అచ్చట పుష్కరమ్మున మహాతపమున్ ముని చేయజూచి తా
మెచ్చి ఋషిత్వమిచ్చె పరమేష్ఠియు క్రుంగక గాధిసూతియున్
హెచ్చిన పౌరుషమ్మున కృశించి తపింపగ తీక్ష్ణకాంతి కా
ర్చిచ్చుగ రేగ లోకములు చిక్కుల గూరెను దల్లడిల్లుచున్ 31

తే.గీ. ఎట్టు లైనను మునిచేయునట్టి తపము
చెరచి లోకమ్ము సంరక్ష చేయవలయు
ననుచు గోత్రారి సభలోన నానతీయ
మెరుగు బోడియై మేనక మెరిసె భువిని 32

చం. మొలక చిగిర్చె నాచివురు మోవిని కోరక మొక్కదుండె నా
కళికలు విచ్చె నా విరులుగంధము పంచెను సౌరభమ్ముచే
నళులు భ్రమించె నా భ్రమణమందున తేనెలు జాలువారె నా
తలిరులతోటలోన సుఖదంపు వసంతము వచ్చువేళలన్ 33

ఉ. మబ్బును మబ్బుధీకొనగ మధ్యన పుట్టిన యగ్నిమాలికల్
మబ్బులవెంటపారి జలమజ్జన మాడగలేక నేలపై
దబ్బున జారి పుష్పతరు తండము మాటునజేసినిల్చె తా
మబ్బురపాటుదోప చపలాక్షిగ రూపము సంతరింపగన్ 34

చం. పరిమళ పూరితమ్ము సుఖవంతమునౌ మలయానిలమ్ము మై
దొరయగ ఝల్లుమంచు నెదత్రుళ్ళగ కన్నులు విచ్చెమౌని నా
విరివనమందు స్వర్ణమయ విగ్రహ మొక్కటి ప్రాణవంతమై
కరచరణమ్ములున్ గదల కళ్ళు కదల్చినయట్లు దోచెడిన్ 35

మ. అది సౌందర్యపు రూపమంచెరిగి మోహాపూర్ణ చిత్తమ్ముతో
పదముల్ సాగ తపమ్మువీడి యపురూపమ్మైన నీరూప సం
పదకున్ దాసుడనైతి నోమదవతీ! పాలింపవేనన్ను నీ
పదముల్గొల్చి తరింతు నేననుచు విశ్వామిత్రు డాడెన్ దరిన్ 36

మ. కరముల్ గైకొని పుష్పవాటికలలో కాసార తీరమ్ములో
విరులన్ పన్నిన శయ్యలన్ బొదల వాపీకూప పారమ్ములన్
తరుషండమ్ముల పర్ణశాలల నదీ స్థానమ్ములన్ నిష్ఠ మై
స్మర యజ్ఞమ్ముల ముగ్గితేలిరి మహా సౌఖ్యమ్ములన్ జుర్రుచున్ 37

తే.గీ. అట్లు పదియేండ్లు మేనకనాదరించి
కంతుసామ్రాజ్యమేలెను గాధిసుతుడు
అంతజీవనలక్ష్యంబు లంతరంగ
మందు జ్వలియింప కౌశికుడార్తినంది 38

మ. తపమున్ వీడితిలక్ష్యమున్ మరచి కాంతారాగ బద్ధుండనై
విపరీతమ్ములు నెట్లుకల్గెనొకదా భీతేక్షణా!యిందు నీ
యపరాధమ్ములు లేవుపొమ్మనుచు తా హస్తమ్ములాడించి పెన్
తపమున్మూరగ నిశ్చయించె మునియున్ ధర్మైక నిష్ఠారతిన్ 39

మ. జలముల్ గ్రోలుచు పర్ణముల్ దినుచు నిష్ఠన్ నేలపైనిల్చి య
గ్గలమౌ నగ్నుల మధ్యలోన హిమవత్ ఖండమ్ములన్ వర్షధా
రల లో ముద్దయి వాయువుల్ మెసవుచున్ రాజిల్లె నిష్ఠూరమౌ
తులలేనట్టి తపాన గాధిసుతుడున్ దుర్భేద్యుడై నిల్చుచున్ 40

తే.గీ. అట్టి తపమును చెరుపంగ నమరవిభుడు
అచ్చరను రంభనానోర్తు పుచ్చెనటకు
భయపడుచు నామె ముని తపోవాటి చేర
కన్నులెఱ్రపడ శపించె గాధి సుతుడు 41

మ. ఘనుడౌ యింద్రుని దుష్టకార్యమిదియౌ కాకున్న కామాదులన్
తృణతుల్యమ్ముగ వీడినట్టి నను నీ తీరున్ పరీక్షించెదో
ఘన పాషాణము నౌచు నార్తినిలు ముక్కాలమ్ము వేలేండులీ
వనమున్ మోక్షణమౌ వశిష్ఠు కృపచే ప్రారబ్ధమున్బొందుమీ 42

కం. అని ముని శపియించుచు రం
భను తూర్పుకు తపము జేయ మరలెను వేగన్
మునిని వశిష్ఠుని చేరుట
తనలక్ష్యంబనుచు తలచి తన్మయుడగుచున్ 43

## బ్రహ్మర్షి విశ్వామిత్ర

మ. మనమున్ కట్టడిసేసి కుంభకమునన్ మార్తాండు నీక్షించుచున్
తనువున్ శోషిల నూర్ధ్వబాహుడగుచున్ ధ్యానంబులో కూరి తా
ననిదంపూర్వ తపమ్మునన్ నిలచె నిష్ఠాపూర్ణ చిత్తంబునన్
ఘనుడా గాధి సుతుండు విఘ్నజితుడై గంభీరుడై ధీరుడై 44

మ. స్థిరమౌ చిత్తముతోడ స్థాణువగుచున్ తేజమ్ము పెంపొంద ధీ
వరుడౌ కౌశికు దీక్షకున్ మురిసి విశ్వామిత్ర !యిచ్చోట దు
స్తరమౌ దీర్ఘ తపమ్ము సేసితివి నీ సంకల్పమీడేరగా
వరమున్ కోరుమటంచు బ్రహ్మ పలుకన్ పద్మోద్భవున్ గొల్వగన్ 45

తే.గీ. నీవు బ్రహ్మర్షి వయ్యెదు నేటి నుండి
నీకు దీర్ఘాయువిచ్చితి నీవుశుభము
గనుమనుచు ధాత దీవింప గనులదోచి
కౌశికుడు బల్కె నానంద కందళమున 46

ఉ. కోరినవన్ని యిచ్చితిరి కోరెద నొక్కటి కష్టమైన నోం
కారమొసంగుడయ్య మరి కాదన రానిది యొక్కటౌ వషట్
కారము రెంటినిచ్చి యుపకారము చేయ వశిష్ఠుచేతి సత్
కారము చేయ బ్రాహ్మణత గల్గును గావున నట్లుసేయుడీ 47

తే.గీ. నీవు బ్రహ్మర్షి వైతివి నిజము సుమ్ము
ఘన తపోబల విభవాన కౌశికేయ
అని వశిష్ఠుడు పల్కుచునాదరింప
గాధిసూనుని కొనియాడె కమలభవుడు 48

మ. వనమధ్యమ్మున ఘోరమౌతపముచే వాగీశు మెప్పించి వ
చ్చిన విఘ్నమ్ములనెల్ల దాటి ఋషియై చిద్రూపుడై ధీరుడై
ఘనతత్త్వమ్మగు బ్రాహ్మణత్వ మును నోం కారమ్ము సాధించు నా
మునిగాథల్ విని సంతసించితిమి నీ మూలమ్ముగా నిప్పుడున్ 49

తే.గీ. అని శతానందుతో బల్కి యనఘు మెచ్చి
సంధ్యవార్చగ వెడలెను జనకవిభుడు
కదిలె రాఘవులనుగూడి గాధిసుతుడు
సంధ్యకర్మాల నిష్ఠ మై సలుపు కొరకు 50

## శివ ధనుర్భంగము

తే.గీ. పూర్వసంధ్యను, కర్మలు పూర్తిచేసి
జనక భూపతి నాహ్వాన సరణి చేసి
రామలక్ష్మణులను గూడి రాజు కడకు
ఘనుడు బ్రహ్మర్షి వచ్చెను గాధిసుతుడు 51

మ. అనఘుల్ శ్రీరఘువంశ దీపకు లయోధ్యాపాలకుల్ ధీరులున్
రణవిద్యావర పట్టభద్రులు ఘనుల్ ప్రజ్ఞానిధుల్ వారలున్
మణిభూషామయమై శివాకరమునై మంజీరశింజానమౌ
ఘనకోదండము చూడవచ్చిరి ప్రభూ! కాంక్షల్ పిసాళింపగన్ 52

తే.గీ. జనక భూవిభుడంతట సంతసమున
ధనువు తెప్పింప భటులను పనిచెనపుడు
గాధిసుతుతోడ రాఘవుల్ గాథవినగ
ధనువు చరితను వివరించె జనకవిభుడు. 53

చం. శివరహితంపు యాగమును చేయగ దక్షుడు పూనువేళ నా
భవుడుభయంకరుండగుచు పావన మైనధనుస్సుగొంచు నా
హవమునకిచ్చుగించు నసురారుల వ్రేయగజూడ వారలున్
శివపదపద్మమున్ గొలువ జిన్మయు డంత ప్రసన్నుడయ్యెడిన్ 54

తే.గీ. దేవతలనెల్ల క్షమియించి దివ్యధనువు
వారలకునిచ్చి తపముకై భవుడుసాగె
దేవరాతునికడ విల్లు దేవతాళి
న్యాసముంచిరి భక్తితో హరిని మ్రొక్కె 55

మ. నిమి వంశంబున దేవరాతుడొడమెన్ నిర్మోహుడై జ్ఞానియై
సమధర్మాచరణుండునై వరలు నా సర్వజ్ఞుడున్ భక్తి స
త్తముడంచున్ సురపాళి యాశుధనువున్ దత్తమ్ముగావించుచో
నిమి దానిన్ గడుభక్తి భద్రపరచెన్ నిత్యంబు పూజించుచున్ 56

తే.గీ. నాటినుండియు నయ్యది నేటివరకు
ప్రణతులందుచు మాయింట వరలుచుండె
దీని నెక్కిడు వానికి జానకిని నొ
సంగెదంచును వివరించె జనకవిభుడు 57

ఉ. జన్నముచేయగాదలచి చక్కగ భూమిని దున్నుచుండ నా
దున్నిన చాలులో శిశువు దోచెను, దానిని నాదుగుండెపై
నన్నున పెంచికొంటి సుతయంచును సీత యటంచునొప్పె నా
యన్నులమిన్న పెండ్లికయి యా ధను వుంకువగా దలంచితిన్ 58

మ. బలతేజోవిజయుండునౌ ధవునికై ఫాలాక్షుకోదండమున్
బలిమిన్ శుల్కము చేసినాడ ధనువున్ స్వద్భుజావీర్యుడై
విలువిద్యావిభవాన నెక్కిడినచో శ్వేతాంగి వైదేహి ను
జ్జ్వలుడౌ వానిని పెండ్లియాడునిదిమా వాగ్దానమై నిల్చెడిన్ 59

మ. ధరపై గల్గెడి రాజసూనులకటా ధైర్యంబుగావచ్చి యా
బరువౌ విల్లు కదల్చలేక మృషగా భావించి దండెత్త నీ
శ్వరమాహాత్మ్యముచేసి పాసెనవిపో సత్యమ్ములీగాథలున్
భరమౌచాపమునిద్ది చూడుడిపుడే పంపింతు రప్పింపగాన్ 60

తే.గీ. పుష్పగంధాక్షతలతోడ పూజచేసి
అష్టచక్రాల శకటాన నధివసించు
శివునిచాపమ్ము బలిమిని చేదిరపుడు
బలముగలయట్టి వేలాది భటులునకట 61

కం. జనక క్ష్మాపతి పలుకులు
విని విశ్వామిత్రుడపుడు విల్లును వీక్షిం
పను రఘుకులునకు నంతట
ననుమతి నిడ రాఘవుండు నానందముతోన్ 62

మ. గురుపాదమ్ముల భక్తిమైదలచి యుగ్రున్ త్ర్యక్షు నృత్యప్రియున్
స్థిరచిత్తమ్మున నంజలించి ఘనమౌ శ్రీచాపమున్గొల్చి స
త్వరుడై వీర్యము గూడకట్టి నిదురన్ వర్తిల్లు పెన్బామునా
నెరియౌ చాపము బూలచెండు బలె వన్నెన్ బూనె రాముండటన్ 63

మ. జనసామాన్యులు మాన్యులౌ నృపతులున్ సంతోష సంరంభమున్
గనుచో కౌశికు డాదరమ్ము లెగయన్ గంభీరుడై క్ష్మాధవుం
డును సౌమిత్రియు భక్తి తత్పరతలన్ దోగాడి వీక్షించుచో
ఘనకోదండము రాముడెత్తె నట దా కౌశల్యమొప్పారగన్ 64

మ. కరమున్ జాచిమహాధనుస్సునడుమన్ కౌసల్యపుత్రుండు సు
స్థిరుడై పట్టుచు వింటినారి తొడిగెన్ శీఘ్రమ్ముగావంచి స
త్వరమై నెక్కిడుచుండ త్రెళ్ళెనదిపో భాసించెఖండంబులై
ఉరవౌ శబ్దము వ్యాప్తి జెంద జగముల్ హోరెత్త భీతిల్లగన్ 65

మ. జలధుల్ నొక్కటకుళ్ళగిల్ల ఘనముల్ సర్వమ్ము ఢీకొట్ట న
గ్గలమౌ కంపము చేసిభూమి తొనకన్ కల్లోల మై వ్రయ్యలై
కులభూభృత్తులు నేలగూల ఘనమై ఘూర్ణిల్లు రావమ్ము ను
జ్జ్వలమై రేగిన యట్లు నొక్కరవమున్ సంధిల్లె చాపమ్మునన్ 66

తే.గీ. ఆ మహారవ మోంకార మట్లు దోచి
విశ్వమెల్లను ధ్వనియించె పెల్లురేగి
ఓం నమశ్శివాయ యనుచు నొక్కరీతి
వసుధ యంతయు పలికెను పరమశివుని 67

ఉ. మోహనమోహనుండు గుణపూర్ణుడు బాహుబలుండు ధీరుడౌ
సాహసి చాపవేది రణసత్త్వుడు శ్రీరఘురాముడంచు వై
దేహికి నీడుజోడనుచు తెల్లము నయ్యెను వీర్యశుల్కయౌ
గేహినిచేసి రాఘవుడు కీర్తి వహించును సర్వకాలమున్ 68

మ. ఇరువంశమ్ముల కీర్తులున్ బెరుగునీ యిక్ష్వాకు బంధమ్ముచే
ధరణీజాతయు ధన్యయౌ మిగులనే ధన్యుండనై నొప్పితిన్
కరమీవార్త నయోధ్య భూధవునకై కార్యజ్ఞులౌ మంత్రులన్
త్వరగా నంపుచు విన్నవించుకొనెదన్ ధర్మజ్ఞ మీరూయనన్ 69

చం. జనకుని యానతిన్ గొనుచు శాస్త్ర విధిజ్ఞులు మంత్రిసత్తముల్
కనక రథమ్ములన్ నిలిచి గ్రక్కున సాగి యయోధ్యవీథులన్
ధనగుణ భూషితమ్ములను ధార్మిక కార్య విరాజితమ్ములన్
గనుచు ముదమ్ముతోడ పరిఖల్ తరియించుచు కోట చొచ్చుచోన్ 70

తే.గీ. వారు దశరథ పతికిని ప్రాంజలించి
సకల రాజ్యపు సంక్షేమ సంగతులను
ధర్మ మంత్రాంగ చణులౌచు ధరణి నడుపు
రాచవర్గంపు క్షేమముల్ రయముదెలిసి. 71

మ. శివచాపమ్మును నెక్కు పెట్టు దొరనే సీతమ్మ పెండ్లాడు నుం
కువయై నొప్పెడి దాని నిండుసభలో కూలంగ సారించె సం
స్తవనీయుండగు రామభూవిభుడు మీ మా వంశముల్మెచ్చగా
భవదీయాజ్ఞ వివాహమున్ జరిపెదో బంధమ్ము నిల్పంగదే 72

చం. జనకుని మాటగా పలికి క్ష్మాపతి సన్నిధి దూతలెల్లరున్
వినయముతోడ నిల్చిరి చెవిన్ సుధ లొల్కినయట్లయోధ్యభూ
ధనుడును తన్మయుండగుచు ధన్యత నొందితినంచు పెండ్లికై
తనపురమంతయున్ దరలు దథ్య మటంచును పుచ్చెవారలన్ 73

## సీతాకల్యాణము

ఉ. రాముడులక్ష్మణుండు ముని రాజగు గాధితనూజు రక్షణన్
క్షేమము నున్నవారలట శ్రీ రఘురాముని చాపకౌశలం
బామహి రక్షకుండెరిగి యాత్మజ నిచ్చుచు పెండ్లి సేసి యా
శేముషికోరుచుండె నని శ్రీరఘురాముని తండ్రి తెల్పుచోన్ 74

తే.గీ. అంత సభలోన వారలు హర్షమంద
రామకల్యాణవార్తలు సీమయంత
ప్రాకె క్షణములో; నంతిపురమ్మునందు
పెండ్లి సంబరాల్ మొదలయ్యె వివిధగతుల 75

చం.	ధనములు స్వర్ణహారములు తౌతిక కాంచన రత్నభూషలున్
మణిమయ కంకణమ్ములను మంజు మనోహర వస్త్రపాళికల్
గొనుచును కోశపాలకులు గుట్టుగ సాగుడు తొల్లి సేనతో
వెనుకను బ్రాహ్మణుల్ యతులు విజ్ఞులు పౌరులు సాగివచ్చుచోన్ 76

సీ.	రత్నాంబరాళితో రాణివాసములెల్ల
బంగారుమేనాల బరుగుచుండ
జవనాశ్వములపూన్చు స్వర్ణరథమ్ముల
రాజబంధువులెల్ల రాజిలంగ
పంచకల్యాణిపై స్వారీలు చేయుచు
రాజకుమారులు గ్రాలుచుండ
ఏనుగంబారీల నెలమి సౌఖ్యమ్ముల
మంత్రిసామంతులు మనుచునుండ
తే.గీ.	శకటములనెక్కివేలాది జనులుతరల
ఘనమునౌ నయోధ్యాపురి కదిలి కదిలి
మిథిలకైసాగె పెండిలి మిషను చేసి
రామకల్యాణమన్నచో ప్రజకు ప్రీతి 77

చం.	ఘనరథపాళి యశ్వబలగమ్ము గజమ్ములు సైనికాళి తా
మినకులు పెండ్లి వేడుకల నెంతయు నొప్పుచు వెంటనంటగా
తన బలగమ్ముతోడ త్వరితమ్ముగ పంక్తిరథుండు పెండ్లికై
జనె గిరిభేది వైభవము సర్వ విధమ్ముల మీరుచుండగన్ 78

తే.గీ.	పెండ్లి వారలు వచ్చెడి వివరమెల్ల
తెలిసి మంత్రిపురోహితమాన్యవర్గ
ములనుగూడి జనకరా జపూర్వవైభ
వాన నెదురువచ్చెనటనాహ్వానమిడగ 79

ఉ. స్వర్ణమయమ్ములై మణి వివర్ధితమౌ గల రత్నభూషలున్
వర్ణమయమ్ములౌచు పలు వర్ణపు కాంతులజిల్లు వస్త్రముల్
పూర్ణమనస్కులౌచు పలుముచ్చట లాడుచు వారువీరునున్
నిర్ణయబద్ధులౌచు రసనిర్భరు లౌచును కాన్కలందుచున్ 80

చం. కుశలములాడి చెక్కిళుల కుంకుమ పుప్పొడులద్ది గంధముల్
విసవిసనద్దికొంచు కులవృద్ధుల, జ్ఞాతుల బంధువర్గపున్
యశము లెరుంగజేయుచును హాస్యము లాడుచు కౌగలించుచున్
మెసవిరి విందులన్ నిడుతమిన్ గొని పెండిలి వారలందరున్ 81

కం. ఎయ్యవి యెవ్వరికొప్పునొ
అయ్యవి వారలకుగూర్చి యామోదమునన్
వియ్యాల వారికప్పుడు
నెయ్యముతో బసలనిడిరి నెరి నధికారుల్ 82

మ. స్తవనీయమ్మగు సూర్యవంశవిభుతో సంబంధ బాంధవ్యముల్
భువిలో కల్గ నదృష్టమౌ యిపుడుమా పూర్వీకమౌ పుణ్యముల్
శివమైపండెను పెండ్లిమూలముననే శీఘ్రమ్ముగా జేయ నీ
సవనా నంతరమాచరింతుమనఘా సౌముఖ్యమున్ జూపరే 83

కం. అనిజనకుడునన దశరథు
డనియెను దాతమనసెరిగి యట్లెగ్రహీతల్
మునుముందుకుసాగవలెను
అనువగు గతి పెండ్లి జరుపు డనఘుల్ మీరల్ 84

మ. సవనమ్మున్ ముగియించిభూధవుడు వే సాంకాశ్యభూపాలుడౌ
నవతేజోమయుడౌ కుశధ్వజునకున్ నవ్యంబులౌవార్తలన్
వివరింపన్ గొనితేర వేగులనుపంపెన్ భ్రాత వెన్నంటగా
భువనాధీశు నయోధ్యవాసు గలిసెన్ పూర్వోక్తమౌరీతిగన్ 85

ఉ. శ్రీరఘువంశదీపకులు శ్రీ రఘురాముడు లక్ష్మణుండు స
దీ్వరులు వారికిన్ మిథిల దేశపు కీర్తుల సీతనూర్మిళన్
కూరిమినిత్తు పెండ్లికయి గోముగ మీరలు స్నాతకాది స
త్కారముచేయుడయ్య శుభదమ్మగు మంగళ హారతిచ్చుచున్ 86

తే.గీ. అనుచు దశరథు తోడుత జనకు డనగ
వల్లెయని ననుజ్ఞనిడెను పంక్తిరథుడు
ఘను వసిష్ఠుననుమతిని గాధిసుతుడు
పలికె వైదేహు తోడుత వాక్యతతిని 87

చం. రణగుణవిక్రముల్ బుధులు రాముని తమ్ములు గల్గిరిర్వురున్
ఘనగుణరూపయౌవనులు కల్గిరి తమ్ముని కూతులిర్వురీ
క్షణమున రెండుజంటలకు చక్కగ పెండిలి చేయుచో సదా
ఘనతయు గూరు మీకు శుభకార్యము గూర్చియు చింతచేయుడీ 88

ఉ. కమ్మని మాట చెప్పితిరి కౌశిక వర్య మదీయ సోదరున్
కొమ్మల సూర్యతేజులకు కొమ్మని నిచ్చుట మాదుభాగ్యమౌ
ఇమ్మహి, పూజ్యపంక్తిరథు డేమి వచించునొ యట్లుచేయుటల్
దమ్మము రాఘవేంద్ర శుభదమ్మగు కూరిమి హర్షమేకదా 89

ఉ. దాతలు మీరు మీరలిడు దానిని గొంటయు మాదుభాగ్యమౌ
చేతము మోదమున్ దగుల జేయు డటంచు నయోధ్యభర్త సం
ప్రీతి మెయిన్ వచింప ముని వృద్ధులు మంగళమంచునాడ వి
ఖ్యాతిని బొందు రాఘవ మహాన్వయ రీతి వశిష్ఠుడాడుచోన్ 90

సీ. బ్రహ్మకును మరీచి వానికి కశ్యపు
డతనికి సూర్యుడు నతని సుతుడు
గన మనువతని కిక్ష్వాకువు నతని
గోత్రమునత్రిశంకుడు ధర్మమూర్తి

మరి వారి గోత్రుడు మాంధాతృభూపతి
వంశ్యుడు భరతుడు వారిగోత్ర
భవుడుసగరుడు వానిగోత్రుడుదిలీ
పుడు కొడుకుభగీరథుడును వాని

తే.గీ. సుతుడు కాకుత్స్థుడగువానిసుతుడురఘువు
వాని వంశమున నహుషుడు వాని సుతుడు
ఘన యయాతియు వానికి మనుమడజుడు
అజునిపుత్రుడు దశరథు డార్యసుతుడు 91

తే.గీ. ఇట్టి పేరెన్నికైనట్టి యినకులమున
పుత్రకామేష్టి ఫలముగ పుత్రులగుచు
రామచంద్రాదు లుదయించి రాజ్యకీర్తి
చిరము నిల్పిరనుచును వసిష్ఠుడాడ 92

సీ. వధువు వంశముగూర్చి పలుకుట యుచితమౌ
నని జనకుడుముదమునను బలికె
నిమితొల్లి పురుషుడు నిమిసుతుడుమిథియు
వానిగోత్రుడు నంది వర్ధనుండు
వానిమన్మడును దేవారాతుడును గోత్ర
భవుడు మరువువానివంశమందు
స్వర్ణరోముడు వాని స్వజుడుధర్మజ్ఞుడౌ
హ్రస్వరోముడునొప్పె రాజునగుచు

తే.గీ. వాని కిర్వురుపుత్రులు వార నేను
జ్యేష్ఠుడను కుశధ్వజుడును చిన్నవాడు
నేను మిథిలను పాలింప తాను నేలె
పొరుగు సాంకాశ్య నగరమున్ బరులుమెచ్చ 93

కం. ఇరువురి వంశక్రమములు
వరుసను దెలుపంగ బుధులు బలెబలె యనుచున్
కరతాళధ్వని సేయగ
చిరునవ్వులొలక నిలిచిరి క్షితిపతులంతన్ 94

ఉ. ఉత్తరఫల్గునిన్ మనువు లుత్తమ మందురు రేపుపుబ్బయౌ
అత్తరి నంకురార్పణము నందున చిత్తము చేర్చుడయ్యమీ
రిత్తరి స్నాతకవ్రతము నిష్ఠలు చేయుడటంచు బ్రాహ్మణుల్
పొత్తులుగూరువారికయి బోధలు సేసిరి నాక్షణంబునన్ 95

చం. కనకపు శృంగముల్ కలిగి కాంచన వర్ణ ఖురమ్ముతోడ ల
క్షణమగు క్షీరధారలిడు చక్కని గోవులు నాల్గులక్షలున్
ధనములు వేనవేలు గొని దానము చేసెను స్నాతకమ్ములన్
జనపతి పూర్ణచిత్తమున సందడి హెచ్చగ సన్నుతింపగన్ 96

ఉ. దారము చుట్టుపాలికల తద్దయు మట్టిని నింపి మంత్రముల్
పారముముట్ట ధాన్యములు పాలిక లందున జల్లి నీటనా
పూరముచేసి మందిరపు మూలల నుంచుచు దానధర్మముల్
పారులకిచ్చెనాజనక పార్థుడు కన్యల నంకురార్పణన్ 97

ఉ. కాంచన వస్త్రధారి వర గైరిక మిశ్రిత రత్నహారి మో
హాంచిత రూపధారి మధురాంచిత హాసవిలాసధారియై
పంచసుమాస్త్ర బోలె మధుపర్కము తోడుత కంకణమ్ముతో
చంచలకాకపక్షుడయి శ్యామల వర్ణుడు వచ్చెనప్పుడున్ 98

ఉ. బాసికముల్ ధరించి మధుపర్కము లల్లన కట్టి రత్నపున్
రాశుల తారహారములు గ్రాలగ సుందరసౌకుమార్యులై
భాసిలిరంత రాఘవుని భ్రాతృగణమ్మును దండ్రితోడుతన్
సేసలుజల్లుచున్ గొమలు శేముషి పాడుచు భట్టులొప్పగన్ 99

ఉ. అంబరమంతపందిరియు నల్లిరి భూమికి సాటివచ్చునాన్
కంబళి పీఠమున్నరిచి గద్దియ లుంచిరి పెక్కు,వీణవా
దంబుల సేయుచుండిరి సితారల మ్రోతల నృత్యగీతముల్
సంబరముల్లసిల్ల జనసాగర మల్లెను పెండ్లివేడుకన్ 100

ఉ. రంగుల పట్టుపుట్టములు రత్నవిభూషిత తారహారముల్
మంగళవేషధారణలు మైనిడు తావులు బుగ్గచుక్కలున్
చెంగటబోటికత్తియలు స్మేర ముఖాంబుజ కాంతిరేఖలున్
పొంగ వధూమణుల్ జనక భూసుత లందరు వచ్చిరచ్చటన్ 101

తే.గీ. జనకుడంత వసిష్ఠునిగనుచుననియె
శ్రీరఘూద్వహు కల్యాణ రీతులన్ని
కనులపండువుగాగ జేకొనుచుమీరు
నిర్వహింపుడు ప్రజలెల్ల నిష్ఠగనగ 102

తే.గీ. గాధిసుత శతానందాది ఘనులతోడ
పెండ్లిసంభారముల్ గూర్చివేదికపయి
అగ్నిహోత్రంబు రగిలించి అచటనునిచి
వేగ కల్పోక్త రీతుల పెండ్లి జరిప 103

ఉ. స్వర్ణ మయమ్ముౌ సరులు స్వర్ణదుకూలపు కాంతిరేఖలున్
స్వర్ణపు మేనిఛాయ తల స్వర్ణసుమమ్ములు గ్రాలగా తలన్
స్వర్ణపు మేల్ముసుంగు కొనజారగ సిగ్గులబుగ్గచుక్కతో
భూర్ణిజ పెండ్లిపీటపయి ముచ్చట నొప్పెను మోహనాంగియై 104

కం. ఒక్కరి కొక్కరునీడై
ఎక్కుడునై నొప్పినట్టు లెసగిరి వారల్
చక్కని మంగళ రూపము
నక్కాచెల్లెంద్రులచట నబ్బురపరచన్ 105

చం. ఎదురుగ పెండ్లిపీటల వసింప వధూవరు లిర్వురానడిన్
కుదురగు పట్టుదుప్పటముగూర్చ ముహూర్తపు కాలమందునన్
మృదువగు జీరమున్ గుడము పేరిమి శీర్షమునందునుంచుచో
చదలను దేవదుందుభులుసాగెను పుష్ప సువృష్టి రేగుచోన్ 106

తే.గీ. వధువు శిరమున వరుడు నావరునిశిరము
నందు వధువును పుణ్యమయమ్ముసైన
జీలకర్రబెల్లపుముద్ద చెలిమినుంచ
నదియ సుముహూర్తపాలన యరసిచూడ 107

మ. ఘనుడౌ రాఘవు పాదపద్మములు బంగారంపు పళ్యారమం
దున నొప్పారగ స్వర్ణపాత్రగొనుచున్ తోరంబుగాధారగా
వనమున్ రాజ్ఞియు పోయకాళ్ళుకడిగెన్ భక్తిన్ నరేంద్రుండు నా
ఘనసారమ్ముశిరమ్ముపై నిడుకొనెన్ కల్యాణ కాలమ్మునన్ 108

తే.గీ. రామలక్ష్మణులకటుల రాజవిభుడు
కన్య దానమ్ము చేయగకాళ్ళుకడిగె
జనకు పథమును సాగి కుశధ్వజుండు
భరత శత్రుఘ్నులపదము లరసికడిగె 109

మ. స్థిరుడై నాతిచరామియంచు వధువున్ చేపట్టి మాంగల్య బం
ధురమౌ సూత్రము కంఠసీమ నిడుచున్ తోరంపు టక్షింతలన్
పుర సంఘమ్ములు జల్లుచుండ తలపై ముత్యాల ప్రాల్ పోయగా
వరుడౌ రాముడు సిద్ధమయ్యె వధువౌ వైదేహి ప్రీనందగన్ 110

ఉ. జానకి కేలుచెందొవల స్వచ్ఛపు సౌమ్యు లు తమ్మికెంపులై
యానుచు రామచంద్ర విభు నౌదల తెల్లని మొల్లలౌచు న
వ్వేణియజారి మేనిపయి వేడుక నీలములౌచునొప్పె క
ల్యాణము చూచువారలకు నబ్బుర పాటును గూర్చుచున్నవై 111

తే.గీ. అట వధూవరులిర్వురునద్భుతమ్ము
నైన తలబ్రాల కేళిలో హర్షమంది
సప్తపదులను ద్రొక్కిరి శాస్త్రవిధిని
నాల్గుజంటలు శ్రద్ధతో నడుచుకొనుచు 112

చం. రగిలెను వీతిహోత్రుడట ప్రాచదువుల్ స్వరయుక్తమౌచు పై
కెగసెను హవ్యధార లొలికెన్ నలు జంటలు జాతవేదసున్
తగుగతి బూజ సేయ పలుద్రవ్యము లాహుతులిచ్చి మ్రొక్క నా
సెగ దొర సాక్షిగా వధువు చేకొనె పెండ్లి కుమారుడంతటన్ 113

ఉ. ఇయ్యది సీత నాదుహిత యీక్షణమందున నీదు పత్నియౌ
నెయ్యముచూపి కైగొనుము నిచ్చలు భద్రము కల్గు రాఘవా!
ఎయ్యెడ నీడయైమసలు నీమె పతివ్రత సుమ్ము పొందుమం
చయ్యెడ నీటిధారలిడె హర్షము తోడ విదేహుడంతటన్ 114

తే.గీ. అటుల జనకభూవిభునికన్యామణులకు
పెండ్లి జరిగెను మోదమ్ము వెల్లివిరియ
నాటి ముచ్చట్లు కథలునై నేటివరకు
కవులకావ్యాల రవళించె కవితలగుచు 115

శా. సీతారాముల పెండ్లి వేడుకలు నా చిత్తమ్మునిండార నీ
రీతిన్ గాంచితి ధన్యమాయె బ్రతుకుల్ క్లీంకారు శ్రీలీలలన్
ప్రీతిన్ దల్చుచు నొప్పుచో తపమునౌ వేగమ్మశీతాద్రికై
యాతీరున్ జనుదేరగావలయు కార్యంబాయె నిచ్చోటలన్ 116

ఆ.వె. తలచి గాధిసూతి తగువారి యొద్దను
సెలవు తీసికొనుచు శీతగిరికి
పయనమయ్యె నంతవారువీరననేల
పెండ్లివారలెల్ల వెడలినారు 117

సీ. పట్టుపుట్టములెన్నొ పసిడిభూషలునెన్నొ
రత్నాలకంబళి రాసులెన్నొ
మదగజమ్ములునెన్నొ మదనాశ్వములునెన్నొ
క్షీరధారలనిచ్చు గృష్టులెన్నొ
స్వర్ణ రథములెన్నొ పల్లకీలవియెన్నొ
బంగారుమేనాల వరుసలెన్నొ
వెండిబంగారాలు వెలలేని ముత్యాలు
గణియింపరానట్టి ధనములెన్నొ
తే.గీ. వీరవరులైన యోద్ధల వేనవేలు
దాసదాసీజనమ్ముల తండములను
జనక భూపతి కూతుల సారె నొసగె
నవనిజనులెల్ల నచ్చెరువందుచుండ 118

తే.గీ. బంధుమిత్రులు మాన్యుల వర్గమలర
రాణివాసమ్ము తోడుత రాచనగరు
క్రొత్తజంటలమేనాలు కూడి రాగ
బయలు వెడలె నయోధ్యకు పంక్తిరథుడు 119

## పరుశురామ గర్వభంగము

మ. అటులన్ వార లయోధ్యకున్ తరల మధ్యన్ దుర్గమంబౌప్రభా
చ్ఛటలున్ దోచెను ధూళిధూసరితమౌ సంహర్షమున్ రేగె న
చ్ఛట క్రోధాక్షు కుఠారధారిని శిఖా జాజ్వల్యు భీతావహున్
పటువౌ చాపము దాల్చు భార్గవుని నవ్వారల్ విలోకించుచోన్ 120

ఉ. క్షాత్రమటన్నక్రోధమనిశమ్మును పొందును భార్గవుండు నీ
క్షత్రియ వైభవమ్ము గని సైచునె? యియ్యెడనొక్కడెద్దియో
చిత్రము నొప్పగావలెను శ్రీ రఘురాముని వైభవమ్ము లీ
శత్రువు చేతిలో పడెనె? శ్యామలు నెట్టుల కాచు టొప్పునో 121

తే.గీ. అనుచు మునులంత తమలోన గొణుగు కొనుచు
అర్ఘ్యపాద్యమ్ములన్ దెచ్చి యభినుతించి
మధురతరమైన వాక్కుల మాన్యుకొలిచి
స్వాగతించిరి భార్గవున్ చతురమతులు 122

తే.గీ. అటుల నర్ఘ్యాదులన్ని సమాదరించి
పెద్ద పెద్దంగలన్ వేసి పెండ్లి కొడుకు
రామ భూవిభు రమణీయరాజసమ్ము
పట్టిచూచుచు పలికెను భార్గవుండు 123

ఉ. ఓ రఘురామ నిన్గురిచి యున్నత మైన బలంబు గూర్చి కా
మారి ధనుస్సునెక్కిడిచు నంతట కూల్చుటగూర్చి దానిదౌ
భూరి రవంబుగూర్చియును మున్ విని యుంటిని దానిసాటియౌ
శౌరి ధనుస్సునిద్ది గొని చాపము నెక్కిడు వీర్యమొప్పగన్. 124

తే.గీ. దీని నెక్కిడు భుజబల మూనెదేని
ద్వంద్వయుద్ధంబు జేయంగ దయనుచూపి
నీకు నవకాశ మిచ్చెద నిజము సుమ్ము
యనగ దశరథుడు పలికె నార్తితోడ 125

చం. భృగుకులవంశ చంద్ర రణవిక్రమ క్షాత్ర కుఠార రామ నీ
పగ పరిపూర్ణమయ్యెకద వాసవు సాక్షిగ నస్త్రశస్త్రసా
భగము త్యజించు వాడవు ప్రవాళము పైని కుఠారధారలా?
తగదిది రామచంద్రుడె ముదమ్మును గూర్చెడిమాదుప్రాణమౌ 126

చం. దశరథుమాటలన్ గొనక దాశరథిన్ గని విశ్వకర్మ పెన్
పసగల చాపముల్ నిలిపె భర్గుడు నొక్కటి విష్ణువొక్కటిన్
కసిమెయి గొంచు పోర హరిగర్జన చేయగ కాంతి హీనమై
పసచెడె శైవచాపమది భగ్నము నయ్యెను నీదుచేతిలోన్ 127

మ. హరిచాపమ్మిది యుద్ధమున్ విజయుడౌ యాదిత్యుడిద్దాని స
చ్ఛరితుండైన ఋచీకుకిచ్చె నతడున్ సత్యుండు నాతండ్రికిన్
కరమిచ్చెన్ జమదగ్నినాకొసగెపో కాకుత్స! కైబూని వే
శరసంధానము చేయచో ననికి నా సంసిద్ధతల్ రూఢియౌ 128

చం. తపమునగూరుతండ్రి జమదగ్నిని చంపిన కార్తవీర్యుపై
కుపితుడ నౌచు క్షత్రియుల గుంపుల నెల్ల వధించి ధాత్రి నిన్
నృపతి విహీనజేసి యవనీస్థలి కాశ్యప మౌనికిచ్చినే
తపమొనరింప నింద్రగిరి దారులు పట్టితి తొల్లి చూడగన్ 129

మ. అనిదంపూర్వ పరాక్రమంబనుచు నీ ఖ్యాతిల్ ధరన్ నిల్చె నా
ఘనవీర్యంబును చూడనెంచితిని విఖ్యాతమ్మునౌ చక్రిదౌ
ధనువున్ గైకొని యెక్కుపెట్టుమిది నీ దర్పమ్ము ఖండించు నం
చనుప్రౌఢమ్ముగ భార్గవుండనిన నా చూడంచు రాముండనెన్ 130

చం. జనకుని చంపువాని నని జంపుట నయ్యది వీరకృత్యమౌ
అనితర సాధ్యమైన రణమందున నిర్వదియొక్కమార్లు ధా
రుణి విభులన్ వధించి తగు క్రోధము చూపితివంచువింటి నీ
రణకుశలత్వముల్ హృదయరంజక మయ్యెను మెప్పుపొందెడిన్ 131

ఉ. నేనొక క్షత్రియాన్వయుడ నేనొక వీరుడ యుద్ధధర్మముల్
పూనికగొన్నవాడ నను పోడిమి తప్పిన యట్లు చాపమున్
పూనుట నేర్వనట్లు రణమున్ దగ చేయనియట్లు నాడుచున్
మానము తీయుటల్ తగదు మాదగు వీర్యము నేడుచూపెదన్ 132

మ. అనిక్రోధమ్మున రాముడాడి బలువౌ యజ్ఞేశు కోదండమున్
గొనుచో భార్గవ రాముడా క్షణమునన్ గోల్పోయె దివ్యప్రభల్
ఘనమౌ వీర్యము క్రోధమున్ మదము నా కాకుత్స్థు తేజమ్ములున్
రణకౌశల్యము ఠీవియున్ పెరిగె విభ్రాంతిన్ జనుల్చూడగన్ 133

తే.గీ. తీక్ష్ణ కాంతిచ్ఛటలుడిగి దిక్కుకొనల
వరలు సూర్యుని యట్టుల భార్గవుండు
తూర్పుకొండల వెలిగెడి తొగలరేని
యటుల రాఘవు డొప్పెను హరులతోడ 134

మ. ధనువున్ చేగొని రాఘవుండు శరసంధానమ్ము గావించి యో
యనఘా! భార్గవ! రామబాణమిదియౌ వ్యర్థమ్ముకాబోదు బ్రా
హ్మణ సంజాతుడ వీవు చంపదగదీ యస్త్రంపు లక్ష్యమ్ముగా
ఘనమౌనీదు తపమ్మునిచ్చెదవొ వేగమ్మైన సంచారమో 135

చం. తెలుపుమటంచు రాముడన తెల్ల మొగమ్మున భార్గవుండు ని
శ్చలపయి నుండగా దగదు సంయమి కశ్యపు వాక్కుచేసి య
గ్గలమగు వేగమౌనడక కావలె నయ్యరొ గాన నాతపః
ఫలములు లక్ష్యమైనిలుచు వానిని కైగొనుమంచు దెల్పగాన్ 136

మ. శరఘాతమ్మున గుహ్యమౌ తపములున్ సర్వమ్ము క్షీణింప స
త్వరుడౌచు మహేంద్ర భూధర సమీపస్థమ్ము వాసమ్ముకై
వరుడౌ భార్గవుడేగెనంత రఘురాట్ వంశస్థ వైశిష్ట్యముల్
ధరణీ లోకము ప్రస్తుతించె విజయధ్వానంబు మిన్నంటగన్ 137

తే.గీ. పరశురాముడు వెడలెను పర్వతాళి
కనెడి మాటను దశరథుడాలకించి
తెప్పరిల్లుచు తనవారు తెరవు కదల
ననుమతించెను మోదమ్ములతిశయిల్ల 138

సీ. కస్తూరి కలయంపి కర్పూర పరిమళాల్
ముత్యాలరత్నాల ముగ్గులలర
చామంతిపూబంతి స్వాగత ద్వారాలు
మల్లెలు మొల్లలు మాలలొలయ

ముంగిళ్ళలోనిల్చి మంగళహారతుల్
పట్టు పురంధ్రులు పట్టణాన
పువ్వులు సేసలు ముత్యాలు నక్షతల్
జల్లెడు ముదితల వెల్లువాయె

తే.గీ. వరులు వధువులతోడుత తరలివచ్చు
పంక్తి రథునకు ఘనమైన స్వాగతమ్ము
పలికినది యయోధ్యాపురీ ప్రాభవమ్ము
మధురమంగళ వాద్యాలు మరలమ్రోగ 139

ఆ.వె. దైవమందిరాన తగుపూజలన్ జేసి
వధువులంత నింట వరలుచుండె
నతివ లెల్ల గూడి హారతి పట్టంగ
పైడి నిచ్చె రాజు పడతులకును 140

మ. వనవాటిన్ ధవునంకపాళి చెలువున్ వామాంగి మైచేర్చిరా
ముని హస్తమ్మునుగొంచు వ్రేలికొసలన్ మున్పంట నొక్కంగ కన్
గొనలంజూచుచు మందహాసమున సిగ్గుల్పొంగు నోష్ఠ్యమ్మునన్
కొనగోటన్ శ్రుతిచేసె రాఘవుడు లో కోర్కుల్ పిసాళింపగన్ 141

మ. అరవిందమ్ముల మధ్యలో నిలచి యా యబ్జాక్షి వైదేహి సుం
దరు శ్రీరాముని సైగలన్ బిలిచె నంతన్ రామచంద్రుండు వే
దరిలో నొప్పెడి పద్మమున్ గొనుచు నందమ్మొప్ప ముద్దాడుచో
పరుగుల్ వెట్టుచు కౌగలించె ధవునిన్ వామాంగి మోహమ్మునన్ 142

మ. ఫలమున్ గోయ విదేహసూతి కరముల్ పైజాచ శ్రీరాముడు
జ్జ్వలుడై నామెను పైకినెత్తి ధరణిన్ జార్చంగ నచ్చోట పొ
క్కిలియున్ వక్షము నోష్ఠమున్ విభుడు తాకెన్ మోముతో సిగ్గునన్
చెలి భూపుత్రిక పారె పూపొదలకున్ స్నిగ్ధుండు వెన్నంటగన్ 143

తే.గీ. అటుల నేకాంతమును వార లనుభవించి
సౌఖ్యమునదేల దినములు సాగుచుండె.
నంత నొకనాడు భరతుని నాదరించి
దశరథుండు వచించెను దయనుజూపి 144

ఉ. అత్తరి పెండ్లికై మిథిల కందర మేగెడి వేళ నా యుధా
జిత్తును వచ్చి నీకొరకు చేసెను ప్రార్థన వానివెంట నీ
విత్తరిపోవుచో పరవశించును కేకయరాజు గాన వే
చిత్తము గూర్చు వారికిని శీఘ్ర మటంచును తండ్రిపల్కుచోన్ 145

తే.గీ. తల్లిదండ్రుల యాశీస్సులెల్లగొనుచు
అన్నలాప్యాయతల్ పొంది యతివతోడ
తమ్ము శత్రుఘ్నునున్ గూడి త్వరితుడగుచు
మామవెన్నంటె భరతుడు మహితగుణుడు 146

చం. జనులకు సానుకూలుడయి శాసనకర్తకు వ్యూహకర్తనై
మునిగణపాళికిన్ మిగులమోదము గూర్చుచు పండితాళికిన్
వినుతసుశీలుడై సమర వేదుల కెల్లను మార్గదర్శి యై
జనకునకూతకర్ర యయి జానకి రాముడు నొప్పుచుండగన్ 147

ఉ. అన్నకు తగ్గతమ్ముడయి యగ్రజు సేవల తన్మయుండునై
అన్నులమిన్న యూర్మిళకు ప్రాణము నౌచును దల్లిదండ్రులన్
మిన్నగజూచికొంచు ప్రియమిత్రుల నెల్లరనాదరించు ల
క్ష్మన్నయు ప్రీతిపాత్రుడయి మాన్యులచే కయి మోద్పులందెడిన్ 148

# షష్ఠ్యంతములు

ఆ.వె. శబరి కొరుకు ఫలము సంతృప్తిమై తిని
మోక్షమిచ్చునట్టి  రక్షకునకు
చెట్టుచాటుచేసి చెనటి వాలిని చంపి
చెలిమికాని కోర్కె నిలుపు పతికి 1

చం. జనకుని యాజ్ఞ చే సకలసంపద లన్ని త్యజించి భార్యతో
వనమునకేగు వానికి కబంధుని బంధము త్రెంచువానికిన్
రణమున రాక్షసాధముల క్రౌర్యము ద్రుంచిన క్షాత్ర దీప్తి కిన్
ఘనునకు రామమూర్తికిని కాశ్యపి నేలిన చక్రవర్తికిన్ 2

కం. కన్నులవెన్నెల గలిగిన
వెన్ననకును మునివరువెనువెంటజనుచుతా
జన్నముగాచిన విభునకు
గ్రన్నన సీతాకరమ్ము గైకొను పతికిన్ 3

ఆశ్వాసాంతగద్య
ఇది కౌండిన్యస గోత్రోద్భవుండు ఉపాధ్యాయవంశ రాకాసుధాకరుండు
సూర్యకాంతనారాయణమూర్తి దంపతుల అష్టమగర్భుండు
శ్రీ పరమేశ్వర పదభక్తుండు
మధురకవి బిరుదాంకితుండు గౌరీశంకర
విరచిత శ్రీరామకథామకరందము బాలకాండము చతుర్థాశ్వాసము
సర్వము సంపూర్ణము

## బాలకాండము సంపూర్ణము

**–శుభమ్–**

